Biku, John, Abik, Salim. All waiting for their birthdays. For their PORSCHE.



Mine was yesterday.

PORSCHE

SAMMO

CHANDAMAMA TOYTRONIX

Mfd. by :
**Chandamama Toytronix Pvt. Ltd.**
Chandamama Buildings,
188, NSK Salai, Vadapalani,
Madras - 600 026




emote-Control PORSCHE Toy Car

- For the first time in India
- Indigenously manufactured
- Design from SAMMO of South Korea

FROM THE HOUSE OF CHANDAMAMA




## తిండి సరిగ్గా తినకపోతే పెరుగుదల సరిగ్గా ఉండదు.

తిండి సరిగ్గా తినని పిల్లలకు, వారి దేహానికి అవసరమైన పోషణ లభించదు. తగినంత పోషణ లభించకపోతే పిల్లల పెరుగుదల కుంటుపడవచ్చు. ఈ పోషణ కొరతను పూరించడానికి వారికి ఇవ్వండి కాంప్లాన్. వారు కోల్పోయిన పోషణను భర్తీ చేయడానికి ఇది సహాయపడుతుంది. కాంప్లాన్‌లో వారి పెరుగుదలకు అత్యావశ్యక అత్యుత్తమ ప్రొటీన్ - పాల ప్రొటీన్ (20%) మరియు వారి దేహానికి కావలసిన 22 ఇతర ముఖ్యమైన ఆహార పదార్థాలు కలవు.

కాంప్లాన్ 5 చవులూరించే
రుచులలో దొరుకుతుంది.

**కాంప్లాన్®**

సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం




GX/27/173 TEL R

SUNNY DAYS!

FUNNY DAYS!

ZANY DAYS!

GO BONKERS!

WITH KWALITY ICE CREAM

Dig into Kwality's enticing BADAM-BADSHAH.

Other delicious super-cup flavours: Exotic PISTA PASSION, Kaju Kishmish, Vanilla

Butterscotch...and exquisite RICH CHOCOLATE. Go bonkers!

Kwality ICE CREAM



VBC FOODS PRIVATE LIMITED

Tadigadapa-521 137. VIJAYAWADA. Phones : 58351 & 58352

C-42, Industrial Estate, Sanathnagar, Hyderabad-500 018.

Phones : 263287 & 261733

LAA

# PARRY'S PAGE

## ఇది మ్యాజిక్

ఇదో పిల్లల్లారా, నా బుజ్జి బుజ్జి నేస్తాల్లారా! మా చేతుల్లో టోపీలు, మంత్రదండాలూ కనిపిస్తున్నాయా? ఏమిటి ఇవి మ్యాజిక్ ప్రదర్శనకే అంటున్నారా? అమ్మో భలే కనిపెట్టేశారే. క్యారమిల్క్, కాఫీ బైట్, ట్రై-మీ నేనూ కలసి మీకు మా ట్రిక్కులన్నీ నేర్పుతాం. మీరు ఇంచక్కా నేర్చుకుని మీ స్నేహితులందరినీ ఆశ్చర్యంలో ముంచేయచ్చు.







## ఫ్లిన్‌క్లిప్ తమాషా

ఓ అడుగు పొడవు, రెండు అడుగుల వెడల్పు ఉన్న కాయితం తీసుకొని దాన్ని మడిచి రెండు పిన్ను క్లిప్పులు ఇలా దాని మీద పెట్టండి. పెట్టి హామ్, హీమ్, ఫట్ అనండి చాలు.



ఎగిరి పోయి ఒకటిగా కనిపిస్తాయి. దీనికి చేయవలసిందల్లా కాయితాన్ని రెండు చివర్లా గట్టిగా లాగడమే. అప్పుడు క్లిప్పులు ఎగిరి కింద పడుతున్నప్పుడు ఒకటిగా కనిపిస్తాయి. అన్నట్టు, మీ వాళ్ళకు ఈ ట్రిక్కు చూపించే ముందు ఒకటి రెండుసార్లు ప్రాక్టీసు చేసుకోవాలి సుమా!



## భయపెట్టే బొటనవేలు




మీ ఎడం చెయ్యి మీ ముందుకు జాపి, వేళ్ళు అన్నీ కుడివక్కకి పెట్టి, అరచెయ్యి మీకు ఎదురుగా ఉంచుకోవాలి. బొటన వేలు మీ వక్కకు వంచాలి (మొదటి బొమ్మలో మాదిరిగా) బొమ్మలో మాదిరిగా మీ కుడిచెయ్యి పెట్టి, దాని చూపుడు వేలుతో సందు లేకుండా మూసేయండి. ఇప్పుడు మీరు కుడి చేతిని ఎడమ చేతి చూపుడు వేలు వెంబడే జరిపితే మీ ఎడమ చేతి బొటనవేలు పైభాగం వూడిపోతున్నట్టు అనిపిస్తుంది. వెంటనే వెనక్కు జరిపేయండేం లేకపోతే అంతా భయంతో కెవ్వున అరవగలరు. చూశారుగా తమాషా పిల్లల్లారా! ఇంక చాలుమరి. ఈ ట్రిక్కులు మీ వాళ్ళందరికీ చేసి చూపిస్తే మీకు భలే సంబరంగా వుంటుంది.




నరే, స్నేహితుల్లారా ఇప్పటికి ఇది చాలు. ఎన్నెన్నో ట్రిక్కులున్నాయి మరి మీ ఇంట్లో పెద్దా చిన్నా మీ స్నేహితులు అందరికీ ఈ మ్యాజిక్‌లు చేసి చూపించండి. ఏమయిందో మాకు రాయండి. మీ స్నేహితులు, కాఫీబైట్, క్యారమిల్క్, ట్రై-మీ, నేనూ మీరు ఏంచేస్తారో ఎదురు చూస్తున్నారు. బై బై.






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## బలమైన పునాది!

ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారు కేంద్రంలో విద్యామంత్రిగా ఉన్నప్పుడు నూతన జాతీయ విద్యావిధానం రూపొందించారు. 1986 వ సం॥లో రూపొందించిన ఆ విద్యావిధానాన్ని అమలు పరచగలమని ఈనాటి నూతన ప్రభుత్వం ప్రకటించడంలో ఆశ్చర్యం లేదు!

ఏ రంగంలో మార్పుకైనాసరే విద్య ప్రధానమైన పాత్ర వహిస్తుంది. విష్ణుశర్మ, ముగ్గురు రాజకుమారులను తన కథల ద్వారా వివేక సంపన్నులుగానూ, సమర్థులుగానూ తీర్చిదిద్దిన ఉదంతం అందరూ ఎరిగినదే. ఆ కథలే 'పంచతంత్రం'గా ప్రసిద్ధి గాంచాయి.

విద్య వ్యక్తిగత జీవితంలోనూ, కుటుంబంలోనూ, తద్వారా సమాజంలోనూ, ఆరోగ్యకరమైన మార్పులు తీసుకువస్తుందనడంలో సందేహం లేదు. ఒక వ్యక్తి మానసిక వికాసానికీ, సంపూర్ణాభివృద్ధికీ, విద్య దోహదం చేయాలి. అయితే, ఈనాటి విద్యావిధానం అటువంటి ఉదాత్తపాత్ర వహిస్తున్నదా అంటే సందేహమే. పైగా యేటా విద్యాలయాల నుంచి బయటపడే వేలకొలది పట్టభద్రులకు సరిపడా ఉద్యోగావకాశాలు లభించడం లేదు. ఇది సామాజిక ఉద్రిక్తతకూ, అలజడికీ కారణమవుతున్నది. ఇది మన విద్యావిధానంలోని లోపమా? ఒక పట్టభద్రుని తయారు చేయడానికి మన ప్రభుత్వం వెచ్చించే ధనంతో ఎనభైమంది పిల్లలకు ప్రాథమిక విద్యను సమకూర్చవచ్చని చెబుతున్నారు. కాబట్టి, మొదట ప్రాథమిక విద్య అందరికీ అందుబాటులోకి వచ్చేలా గట్టి చర్యలు తీసుకోవాలి. సామాన్య ప్రజలలో అక్షరాస్యతను పెంచాలి. అదే దేశ భవిష్యత్తుకు బలమైన పునాది అవుతుంది!

సంపుటి 89    సెప్టెంబర్ '91    సంచిక 3

విడి ప్రతి : 4-00  : :  సంవత్సర చందా : 48-00












# మేగీ క్లబ్-అడవులలో సరదా వినోదం ఉచిత బహుమతుల ఆనందం

బాలలూ రండి ! మేగీ క్లబ్‌లో చేరి, సంవత్సరమంతా సరదా వినోదాలలో పాల్గొనండి. మిమ్మల్ని ఉర్రూతలూగించే న్యూస్ లెటర్స్ బహుమతులు, ఆటలూ ఇంకా ఎన్నెన్నో !

మీరు చేయాల్సినది ఈ [2-minute logo] ను 5 ఖాళీ మేగీ నూడుల్స్ పేకెట్ల నుండి కత్తిరించి, మీ పేరు, చిరునామా, మీకు నచ్చిన బహుమతిని పేర్కొని మాకు పంపండి. మీరు గనుక మెంబరయితే మీ నంబరును వ్రాయటం మరువకండి. మీరింకా మేగీ క్లబ్ మెంబరు కాని పక్షంలో, మెంబరు కావటానికిదే మంచి అవకాశం. మీ వివరాలతో బాటు మెంబర్‌షిప్ కావాలని వ్రాయండి. మీ బహుమతితో బాటు, మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డు ఉచితంగా పంపబడుతుంది.

మా అడ్రసు:

**మేగీ క్లబ్**
పి.బి. బాక్స్, 5788,
న్యూ ఢిల్లీ-110 055





















మరొక ఉపహారం: ఈ సరికి మీరు 'లాస్ ఆఫ్ ద జంగిల్ గేమ్'ను సేకరించి ఉండక పోతే, వెంటనే వాటిని పొందండి.

# నశిస్తూన్న జాతివివక్షత!



క్రీడారంగంలో దక్షిణాఫ్రికా మీద విధించిన నిషేధం తొలగిపోయింది. ఆ దేశం మళ్ళీ అంతర్జాతీయ క్రీడారంగంలో ప్రవేశించడాన్ని ప్రపంచంలోని క్రీడాభిమానులందరూ అమితాసక్తితో ఎదురుచూస్తున్నారు. దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం పాటించిన జాత్యహంకార, జాతివివక్షతా సిద్ధాంతాలకు నిరసనగా, ఇంటర్నేషనల్ క్రికెట్ కౌన్సిల్ (ఐ.సి.సి), ఇంటర్నేషనల్ ఒలింపిక్ కమిటీ (ఐ.ఒ.సి) ఆ దేశాన్ని తమ క్రీడలలో పాల్గొనకుండా 1970వ సం॥ నుంచి నిషేధించాయి. ఇరవైఒక్క సంవత్సరాల తరవాత ఈ జూలైనెలలో ఆ నిషేధాన్ని తొలగించాయి!

నిషేధం తొలగిపోవడంవల్ల, 1992వ సం॥ ఫిబ్రవరిలో జరుగనున్న 'వరల్డ్ కప్ క్రికెట్' పోటీలోనూ, ఆ సంవత్సరాంతంలో జరుగనున్న బార్సిలోనా(స్పెయిన్) ఒలింపిక్స్‌లోనూ దక్షిణాఫ్రికా పాల్గొంటున్నది. దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం అనుసరించిన జాత్యహంకార సిద్ధాంతాలు ఇన్నేళ్ళు, ఆ దేశ యువతీయువకులకు అంతర్జాతీయ క్రీడారంగంలో పాల్గొనే అవకాశం లేకుండా చేశాయి.

ప్రభుత్వం పోకడలో క్రమంగా ఎన్నో మార్పులు రాసాగాయి. పాతికేళ్ళకు పైగా జైలు జీవితం గడుపుతూ, పోరాటం సాగించిన నెల్సన్ మండేలాను 1989వ సంవత్సరాంతంలో విడుదల చేశారు. ఆ తరవాత నెల్సన్ మండేలా, ప్రెసిడెంట్ డీక్లార్క్‌తో చర్చలు జరపడంవల్ల ప్రభుత్వం, జాతివివక్షతను పాటించే ముఖ్యమైన మూడు చట్టాలను రద్దు చేసింది. దాని ఫలితంగా, నల్లజాతి ప్రజలు దేశంలో తమ కిష్టమైన చోట నివాసం ఏర్పరచుకోవడానికీ, తమ పిల్లలను ఇష్టమైన విద్యాలయాలలో చదివించడానికీ, శ్వేతజాతీయులకు సొంతమైన సంస్థలలో సైతం ఉద్యోగాలు చేయడానికీ అవకాశాలు ఏర్పడ్డాయి. దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం పాటించిన జాతి వివక్షతా

సిద్ధాంతాలను రూపుమాపడానికి, ప్రపంచ దేశాలతో పాటు మన దేశం కూడా ఎంతో కృషి చేసింది.

దక్షిణాఫ్రికాలో వస్తున్న మార్పులను ప్రపంచ దేశాలు ఆసక్తితో పరిశీలిస్తున్నాయి. అమెరికా, ఆ దేశం మీద ఆరేళ్ళుగా విధించిన ఆర్థిక ఆంక్షలను తొలగించింది. దానిని జపాన్, హర్షించింది. కాని, ఆస్ట్రేలియా, స్వీడన్ దేశాలు అమెరికా నిర్ణయాన్ని తొందరపాటు చర్యగా ప్రకటించాయి!

దక్షిణాఫ్రికా, అత్యయిక పరిస్థితిని తొలగించింది; రాజకీయ ఖైదీలను విడుదల చేసింది; త్వరలో జాతి వివక్షత పాటించని ప్రభుత్వస్థాపన జరగవచ్చు— అందువల్ల తన చర్య సరైనదేనని అమెరికా వాదిస్తున్నది.

ప్రస్తుత శ్వేతజాతి ప్రభుత్వం తీసుకుంటూన్న చర్యలపట్ల హర్షం వెలిబుచ్చిన నెల్సన్ మండేలా, అప్రమత్తతతో ఉండాలని కూడా హెచ్చరించాడు. ఎందుకంటే, ప్రభుత్వం ఏవేవో సాకులతో ఇంకా చాలా మంది రాజకీయ ఖైదీలను విడుదల చేయలేదు. నల్లజాతీయులలోని భిన్న వర్గాల మధ్య పక్షపాత వైఖరి ప్రదర్శించడంవల్ల, దేశంలో నల్లజాతీయుల మధ్య హింసాకాండ ప్రబలుతున్నది. ఆ కారణంగా స్వేచ్ఛారాజకీయాలకు అవకాశంలేకుండా పోతున్నది. కాబట్టి జాతివిముక్తికి సాధించవలసినది ఇంకా చాలా ఉన్నది!





# ఇద్దరు నిరుద్యోగులు

బాగా వృద్ధుడైన తండ్రి రామదాసు పోగానే, పరశురాంకు బాధ్యత తెలిసి వచ్చింది. పాతికేళ్ళవయసు వచ్చినా, వాడు ఇంతవరకూ ఎలాంటి పనిపాటులూ చూసుకోలేదు. పొద్దస్తమానం స్నేహితులతో కబుర్లూ, జూదాలతో కాలం గడుపుతూండేవాడు. తల్లిలేనివాడని రామదాసు కొడుకును ఏమీ అనేవాడు కాదు. ఇప్పుడు వాడికి, చేసిన అప్పులు తీర్చవలసి రావడంతో, ఉన్న ఒక్క పూరిల్లూ అమ్మేశాడు. వాడి సంగతి బాగా ఎరిగిన వాళ్ళు కావడంతో, గ్రామంలో ఎవరూ వాడికి పనివ్వలేదు.

తిరిగి తిరిగి బాగా విసిగిపోయిన పరశురాం, మరెక్కడైనా బతుకుతెరువు చూసుకుందామని, ఒకనాటిసాయంకాలం వేళ గ్రామం వదిలి బయలుదేరాడు. చీకటిపడే సమయానికి, వాడొక దట్టమైన అడవిని చేరాడు. ఇంతలో అనుకోకుండా పెనుగాలితో పాటు, పెద్దపెట్టున వర్షం ప్రారంభమైంది. ఆ రాత్రికి ఎక్కడ కాలం గడుపుదామా అని, చెట్లకిందుగా నడుస్తున్న పరశురాంకు కొంచెం దూరంలో చిన్న వెలుగు కనిపించింది. వాడు అటుకేసి వెళ్ళాడు.

అది ఒక పాడుబడిన దేవీ ఆలయం. లోపల గదిలో ఒక దీపం వెలుగుతున్నది. యువకుడొకడు ఆ గదిని బట్టతో శుభ్రం చేస్తున్నాడు.

ఆ యువకుడు పరశురాంను చూస్తూనే, ''బాగా తడిసిపోయినట్టున్నావు! ముందు తల తుడుచుకో,'' అంటూ ఒక పొడిబట్ట వాడికి అందించాడు. పరశురాం తల తుడుచుకుని, దుస్తులు మార్చుకున్నాడు.

ఆ యువకుడు, పరశురాంతో తన పేరు యతీంద్ర అని చెప్పి, ''నేను ఎక్కడైనా

మాచిరాజు కామేశ్వరరావు



ఉద్యోగం సంపాయించుకునేందుకు, ఇల్లువదిలి బయలుదేరాను. మరి నీ సంగతేమిటి?'' అని అడిగాడు.

పరశురాం దాచకుండా, తనను గురించి అంతా యతీంద్రకు చెప్పాడు.

అంతా విన్న యతీంద్ర చిన్నగా నవ్వి, ''చూశావా, మనిద్దరం ఒకేపడవ ప్రయాణీకులం అన్నమాట!'' అన్నాడు.

తర్వాత అతను వెంట తెచ్చుకున్న రొట్టెలమూట విప్పాడు. ఇద్దరూ రొట్టెలు తిని ఆకలి తీర్చుకున్నారు.

గదిలో శుభ్రం చేసినచోట ఇద్దరూ పడుకున్నాక, పరశురాం, ''ఈనాటివరకూ ఉద్యోగప్రయత్నం చేయకపోయినా, దానికోసం ప్రయత్నించేవాళ్ళపాట్లు విన్నాను. అంతో ఇంతో లంచం ఇవ్వగలశక్తీ, పలుకుబడిగలవాళ్ళ సాయం లాంటివి లేకపోతే, ఉద్యోగాలు దొరకడం చాలా కష్టం,'' అన్నాడు.

''ఆ మాట నిజమే! కాని, ఎవరైనా ఉద్యోగం ఇస్తే, మన సామర్థ్యం, నిజాయితీ నిరూపించుకోగలం,'' అన్నాడు యతీంద్ర.

''మీకా అవకాశం నేను కల్పిస్తాను!'' అంటూ ఆ గదిలో ఒక దేవతాస్త్రీ ప్రత్యక్షమైంది.

ఆమెను, ఆ ఆలయదేవతగా భావించి పరశురాం, యతీంద్రుడూ సాష్టాంగపడి, ''ఈ నిరుద్యోగుల మీద, నీకయినా దయ కలిగినందుకు ధన్యులం, తల్లీ! ఇంతకూ, నువ్వు మాకు ఎలా సాయపడాలనుకుంటున్నావు?'' అని అడిగారు.

అందుకు దేవత, ''నేను మీకు మూడు మహిమగల వస్తువులిస్తాను. వాటి ద్వారా మీరు సాధించినదేమిటో, మూడో రాజు రాత్రి ఇక్కడికి వచ్చి నాకు చెప్పాలి,'' అన్నది.

''తప్పకుండా చెబుతాం, తల్లీ!'' అన్నారు ఇద్దరూ పరమానందంతో.

అప్పుడు దేవత ఇద్దరికీ చెరొక మట్టిముంతను ఇచ్చి, ''ముంతను నేల మీద

విసిరి బద్దలుకొట్టి, మీరు ఎవరిని తలుచు కుంటే, వాళ్ళు మీముందు వుంటారు,'' అన్నది.

''తలుచుకున్న మనిషి, మా ముందు నిలబడతాడే అనుకుందాం, అందువల్ల ప్రయోజనమేమిటి, తల్లీ ?'' అని అడిగాడు యతీంద్ర.

దేవత ఇద్దరికీ చెరొక మిరియపుగింజ ఇచ్చి, ''ఈ గింజను నోట్లో వేసుకుని, మీరు ఆ మనిషిని ఏమి కోరుకుంటే, అది కాదనకుండా ఇచ్చేస్తాడు,'' అన్నది.

''మరి మూడో వస్తువు ఏమిటి, తల్లీ?'' అని అడిగాడు పరశురాం.



దేవత ఇద్దరికీ చెరొక రాగి ఉంగరం ఇచ్చి, ''ఇది మీ వేలికి వున్నంతకాలం, పై రెండు వస్తువుల ద్వారా మీరు పొంద గలిగింది, మిమ్మల్నే అంటిపెట్టుకుని వుంటుంది!'' అని చెప్పి అదృశ్యం అయింది.

తెల్లవార వస్తూండగా వర్షం పూర్తిగా తగ్గిపోయింది. యతీంద్ర, పరశు రాంను, ''నేను తూర్పుదిక్కుగా వెళు తున్నాను. నువ్వు నాతో వస్తావా ?'' అని అడిగాడు.

''ఊహుఁ, నేను పడమటిదిక్కుగా వెళతాను. మళ్ళీ మూడోనాజు రాత్రి, ఈ అలయంలోనే కలుసుకుందాం,'' అని, పడమటిదిక్కుగా బయలుదేరాడు పరశురాం.

వాడు ఆ రోజంతా నడిచి, బాగా చీకటి పడ్డాక ఒక నగరం చేరాడు: దేవత ఇచ్చిన మహిమగల మూడు వస్తువులూ ఎలా ఉపయోగించుకోవాలో, ముందే నిర్ణయించుకున్నందున పరశురాం, ఒక పెద్ద మేడముందు నిలబడి, మట్టిముంతను బద్దలుకొట్టి, ఆ ఇంటి పెద్ద తనముందుకు రావాలని కోరుకున్నాడు.

కొద్దిసేపట్లో, ఒక నడివయసుస్త్రీ తలుపులు తీసుకుని బయటకు వచ్చింది. ఆమె ఒంటి మీద విలువైన ఆభరణాలు చాలా వున్నవి.



విడవలేదు. వాడి కాలు రక్తంతో తడిసి పోయింది. యజమానురాలు పిలిచినా, కుక్క ఆమె దగ్గిరకు పోలేదు. పరశు రాంకు ఏదో గుర్తుకు వచ్చినట్టయి, వేలికి వున్న ఉంగరాన్ని తీసి దూరంగా గిరవాటు వేశాడు. వెంటనే కుక్క వాణ్ణి వదిలి లోపలికి పోయింది. ఇంటి యజమాను రాలు కూడా లోపలికి పోయి తలుపులు మూసింది.

పరశురాం రెండు రోజులు, ఆ నగరం లోనే వుండి, కుక్క కాటుకు పసరువైద్యం చేయించుకుని, మూడోనాటి రాత్రికి పడుతూ లేస్తూ, అడవిలోని దేవీ ఆలయం చేరాడు.

దేవత వాణ్ణి చూస్తూనే, ''ఏమిటీ విచిత్రావతారం?'' అని అడిగింది.

పరశురాం ఏమీ దాచకుండా జరిగిం దంతా, ఆమెకు చెప్పాడు.

ఇంతలో విలువైన దుస్తులు ధరించి, ఉత్సాహంగా యతీంద్ర అక్కడికి వచ్చాడు. దేవత అతడి అనుభవం చెప్ప మన్నది.

యతీంద్ర, దేవత అనుగ్రహించిన అద్భుత వస్తువులను, తానెలా ఉపయో గించుకున్నదీ చెప్పాడు:

యతీంద్ర అంతకుముందే నిర్ణయించు కున్న విధంగా, తిన్నగా. రాజధానీ

పరశురాం మిరియపుగింజ నోట్లో వేసు కుని, ''మీ దగ్గిరున్న బంగారాన్ని మరో మాట మాట్లాడకుండా, నాకిచ్చేయండి!'' అన్నాడు.

ఆ స్త్రీ నిద్రమత్తులో వున్నదానిలా ఊగిపోతూ, తలతిప్పి, ''బంగారం! బంగారం!'' అంటూ పెద్దగా కేక పెట్టింది.

ఆ మరుక్షణం, లోపలినుంచి బంగారం అన్న పేరు గల సింహం లాంటి కుక్క భీకరంగా మొరుగుతూ వచ్చి, పరశురాం కాలిపిక్క పట్టుకున్నది.

పరశురాం హడలిపోయాడు. కాలు ఎంత విదిలించినా కుక్క తన పట్టు

నగరానికి వెళ్ళాడు. ఆ సాయంత్రం అతడు రాజుగారి ఉద్యానవనం బయట ముంత బద్దలుకొట్టి, రాజుగారి రాకను కోరుకున్నాడు. కాస్సేపటిలోనే ఉద్యానవనంలోంచి రాజుగారు బయటకు వచ్చాడు.

యతీంద్ర మిరియపుగింజను నోట్లో వేసుకుని, "మహారాజా! మీ కొలువులో నాకు తగిన ఉద్యోగం ఇప్పించండి," అని అడిగాడు,

రాజు చిరునవ్వునవ్వి, "మహారాజుగా చేరు!" అన్నాడు.

ఆ విధంగా యతీంద్రకు ఉద్యోగం దొరికింది. కొలువులో కొంత డబ్బు ముందే తీసుకుని, ఉండేందుకు ఇల్లూ, మంచి దుస్తులూ ఏర్పాటు చేసుకుని, దేవీ ఆలయానికి తిరిగి వచ్చాడు.

అతడు రాగి ఉంగరాన్ని తిరిగి దేవతకు కృతజ్ఞతతో ఇచ్చేస్తూ, "తల్లీ, నా స్వశక్తి మీద నాకు నమ్మకం వున్నది. లోగడ ఉద్యోగం సంపాదించుకోవడం సాధ్యపడకపోయినా, ఇప్పుడు సంపాదించుకున్న ఉద్యోగాన్ని నిలబెట్టుకోగలనన్న ఆత్మవిశ్వాసం కూడా, నాకున్నది," అన్నాడు ఎంతో వినయంగా.

"ఇద్దరికీ ఒకేరకమైన వస్తువులిచ్చినా, దురాశకారణంగా పరశురాం వాటివల్ల ప్రయోజనం పొందలేకపోయాడు. నేను ఇచ్చిన మిరియపుగింజ ప్రభావంవల్ల, యతీంద్ర అడిగివుంటే—రాజు అతడికి అర్ధరాజ్యం కూడా ఇచ్చివుండేవాడు!" అని దేవత మాయమైంది.

మర్నాడు తెల్లవారుతూనే నగరానికి బయలుదేరిన యతీంద్ర, పరశురాంతో, "నువ్వు నా వెంట వస్తావా? నీకేదైనా ఉద్యోగం దొరికే దాకా, నా ఇంట్లోనే వుండవచ్చు," అన్నాడు.

"తప్పకుండా వస్తాను! నీతో వుంటూ నేను సంపాదించుకోవలసిన లోకజ్ఞానం ఎంతో వున్నది," అని, పరశురాం, యతీంద్ర వెంట నగరానికి బయలుదేరాడు.



# చిలుక పలుకు

శృంగేరి గ్రామంలో వుండే సిద్దయ్య అనే అతను, చిలుకను కొందామని బజారుకు వెళ్ళి, ఒక దుకాణంలో, అందమైన చిలుకనొకదాన్ని చూసి, దాని ఖరీదెంత అని, దుకాణంవాణ్ణి అడిగాడు.

"వందరూపాయలు!" అన్నాడు దుకాణంవాడు.

"వందరూపాయలే!" అంటూ సిద్దయ్య ఆశ్చర్యపోయాడు.

"ఈ చిలుక సామాన్యమైంది కాదు. కావాలంటే దాన్నే అడగండి, అంత ఖరీదు చేస్తుందో లేదో," అన్నాడు దుకాణంవాడు.

"నువ్వు వందరూపాయల ఖరీదు చేసే మాట నిజమేనా?" అని సిద్దయ్య, చిలుకను అడిగాడు.

"అందుకు సందేహమెందుకు?" అన్నది చిలుక.

ఆ జవాబుకు సిద్దయ్య చాలా సంతోషించి, దుకాణంవాడికి వందరూపాయలిచ్చి, చిలుకను ఇంటికి తీసుకుపోయాడు. ఇంట్లో అతడి భార్యా పిల్లలు అడిగిన ప్రతి ప్రశ్నకూ చిలుక, "అందుకు సందేహమెందుకు?" అని జవాబివ్వసాగింది.

దానితో సిద్దయ్య, చిలుకకు ఆ మాట తప్ప మరేమీ రాదనీ, తాను మోసపోయాననీ గ్రహించి, తల బాదుకుంటూ పెద్దగా, "నేను ఒట్టి అమాయకపు వెధవను, మోసపోయాను!" అన్నాడు.

ఆ వెంటనే చిలుక, "అందుకు సందేహమెందుకు?" అన్నది.

అది విని సిద్దయ్యతోపాటు, అతడి భార్యా పిల్లలు పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

—కోలార్ కృష్ణ అయ్యర్






## 7

[సదానందముని సృష్టించిన అపూర్వుడనే విచిత్రవ్యక్తి, సముద్రపు దొంగలు అపహరించుకుపోతూన్న ఐదుగురు కుర్రవాళ్లను కాపాడడానికి, సమీరుణ్ణి వెంటబెట్టుకుని ఓడలోకి చేరాడు. ఓడ బయలుదేరింది. ఓడలో దొంగలనాయకుడికీ, ఉపనాయకుడికీ మధ్య గొడవ ప్రారంభమయింది. ఉపనాయకుడు, నాయకుణ్ణి కత్తితో పొడిచి చంపాడు. —తరవాత]

తెల్లవారుతూండగా, ఓడలోని దొంగల ఉపనాయకుడు, కుర్రవాళ్ళు పడుకున్న గదిలోకి వచ్చి, ''లేవండి, లేవండి. ఈ సముద్రమధ్యంలో సూర్యోదయం ఎంత అందంగా వుందో చూడండి,'' అని వాళ్ళను నవ్వుతూ తట్టి లేపాడు.

సమీరుడి ద్వారా అపూర్వుడు చెప్పి పంపిన ప్రకారం. ధైర్యంగా కళ్ళు మూసుకుని పడుకుని వున్న కుర్రవాళ్ళు లేచి, చుట్టుపక్కల ఒక్కసారి కలయచూసి, ''ఏమిటి! మేం ఎక్కడ ఉన్నాం? నువ్వెవరు, బాబూ ?'' అని అడిగారు.

''నేను ఈ ఓడ యజమాని, గరళనాభుణ్ణి!'' అన్నాడు ఉపనాయకుడు.

''ఏమిటీ! ఓడ యజమానివా?'' అని ప్రశ్నించాడు సమీరుడు ఆశ్చర్యంగా.

''నన్ను చూస్తూంటే మీకు ఆశ్చర్యం కలగవచ్చు. మిమ్మల్ని ఈ ఓడలోకి



తీసుకువచ్చిన పెద్దమనిషి, ఒక ముఖ్యమైన పనిమీద మరొక చోటికి వెళ్ళవలసి వచ్చింది. మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకునే బాధ్యత ఆయన నాకు అప్పగించి వెళ్ళాడు. ఇప్పుడు మీరు ఓడలో ఉన్నారన్న సంగతి మరచిపోలేదు కదా!'' అన్నాడు గరళనాభుడు.

సమీరుడు ఒళ్ళు విరుచుకుని లేచి నిలబడి చేతులు పైకెత్తి, ''అలస్యమయింది. మేము వెంటనే మా ఇళ్ళకు తిరిగి వెళ్ళాలి!'' అన్నాడు.

''ఆహా....హాఁ,'' అని రాక్షసుడిలా నవ్వబోయిన గరళనాభుడు, క్షణంలో తమాయించుకుని, ''అసలు ఏం జరిగిందో నాకు తెలియదుగాని, మీరు ఆరుగురూ రాత్రి, ఒళ్ళు మరచి నిద్రపోయారు. మీకు నిద్రాభంగం కలిగించడం ఇష్టం లేక ఊరుకుండిపోయాను. రాత్రే ఓడ బయలుదేరింది. రాత్రి తెల్లవార్లూ ప్రయాణం చేసి, చాలాదూరం వచ్చేశాము. ఇక్కడి నుంచి మీరు ఈదుకుంటూ వెళ్ళి, తీరం చేరలేరు గనక, హాయిగా సముద్ర విహారం చేయండి!'' అన్నాడు గరళనాభుడు పరిహాసంగా.

కుర్రవాళ్ళు ఏమీ ఎరగనట్టు, అమాయకంగా ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు.

''అయితే, ఇప్పుడు మా గతేమిటి?'' అని అడిగాడు సమీరుడు మళ్ళీ.

''కొన్ని రోజుల తరవాత, చాలా అనుభవం గడించి, మనం మళ్ళీ తీరాన్ని చేరుకుంటాం. అంతవరకు ప్రకృతి సౌందర్యాన్ని చూసి ఆనందించండి!'' అన్నాడు గరళనాభుడు.

''మీ సలహా బాగానే ఉన్నది. కాని, మేము కనిపించకపోతే, మా తల్లితండ్రులూ, బంధుమిత్రులూ బాధపడిపోగలరు కదా?'' అని అడిగాడు ఒక కుర్రవాడు బాధగా.

''కొన్నాళ్ళ తరవాత మిమ్మల్ని చూసి, వాళ్ళే రెండింతల ఆనందం పొందగలరు

కదా!'' అన్నాడు గరళనాభుడు బిగ్గరగా నవ్వుతూ.

''మీరు చాలా మేధావంతులు!'' అన్నాడు సమీరుడు.

ఆ మాటలకు గరళనాభుడు పొంగి పోయాడు. గర్వంగా దూరంగా వున్న తన అనుచరులకేసి ఒకసారి చూశాడు. ఆ తర వాత కుర్రవాళ్ళను గది నుంచి వెలుపలికి తీసుకువచ్చాడు. మిగతా అయిదుగురు కుర్రవాళ్ళూ, సముద్రంలో సూర్యోదయ దృశ్యాన్ని చూసి ఆనందిస్తూండగా, సమీరుడు, అపూర్వుడి పిలుపు విని అటుకేసి తిరిగి చూశాడు. అక్కడ ఎవరూ కనిపించలేదు. ఎడమ వైపుకు వంగి చూశాడు. అపూర్వుడు ఒక గండు మీనం మీద నిలబడి ఉన్నాడు. ఆ గండుమీనం ఓడను అనుసరించి, ఈదు కుంటూ వస్తున్నది!

''దొంగల గుప్పిటనుంచి బయట పడా లని ప్రయత్నిస్తున్నట్టు పసిగట్టారంటే, వాళ్ళు మిమ్మల్ని హింసించగలరు. ఇప్పుడు దొంగలు మీతో మంచిగా వున్నారంటే దానికి కారణం మీ ద్వారా వాళ్ళేదో సాధించాలని ఆలోచిస్తున్నారనే భావిం చాలి. వర్తకుల ఓడ ఒకటి ఇటుకేసి వస్తుందనీ, దానిని దోచుకోవాలనీ గరళ నాభుడు రాత్రి అనుచరులతో చెప్పడం విన్నాను. వాళ్ళ పథకం విజయం కావ డానికి మిమ్మల్ని ఉపయోగించుకోవచ్చు. వాళ్ళ పథకం మనకు స్పష్టంగా తెలిసిం





దంటే మనం ఏదైనా చేయవచ్చు. అంత వరకూ వాళ్ళతో అతి జాగ్రత్తగా వ్యవహరించాలి!'' అని హెచ్చరించాడు అపూర్వుడు.

''బాబూ, అలా ఇంకా కొంచెం కిందికి వంగిచూశావంటే, అమాంతం సముద్రంలో పడి, తిమింగిలాలకు ఆహారం అయిపోగలవు. ఇక్కడ మేము నీ కోసం కాచుకుని వున్నాం, రా,'' అని కేక వేశాడు గరళనాభుడు నవ్వుతూ.

వెంటనే సమీరుడు గరళనాభుడి కేసి తిరిగి నవ్వుతూ, వాణ్ణి సమీపించాడు. అందరూ భోజనం చేయడానికి కూర్చున్నారు. అప్పుడు సమీరుడు, ''అవును, మీరీ ఓడలో ఏం చేస్తారు?'' అని అడిగాడు చాలా అమాయకంగా ముఖం పెట్టి.

''మేము సముద్ర వర్తకులం నాయనా, మా రోజులు బాగులేక ఇటీవల మా ఓడను సముద్రపు దొంగలు దోచుకున్నారు!'' అన్నాడు గరళనాభుడు.

''దుర్మార్గులు!'' అన్నాడు సమీరుడు.

''పరమ దుర్మార్గులు, నాయనా! నిరాయుధులుగా వున్న సమయం చూసి ఆ దుర్మార్గులు హఠాత్తుగా మామీదికి దాడి జరిపారు. చీమలకైనా హాని తలపెట్టని మాలో పలువురి ప్రాణాలు కూడా తీశారా కర్కోటకులు!'' అన్నాడు గరళనాభుడు ఎంతో విచారంగా.

''అయ్యోపాపం! మీ మంచితనంమాకు తెలుస్తూనే ఉన్నది. లేకుంటే ముక్కూమొహం తెలియని మా ఆరుగురిని ఈ ఓడలోకి అనుమతించి, ఉచితంగానే భోజన సదుపాయాలు కల్పించి, ఇలా సముద్రయానానికి తీసుకువెళుతున్నారంటే, మీరు నిజంగానే పరమ దయామయులు! అదిసరే, మరి మీరిప్పుడు ఏం చేయాలనుకుంటున్నారు?'' అని అడిగాడు సమీరుడు.

''మొదట ఒక ద్వీపాన్ని చేరుకుంటాం. అక్కడ కొంత ధనసంపాదనకు మార్గం కనిపిస్తున్నది....'' అని గరళనాభుడు



ఇంకేదో అనబోయేంతలో, సమీరుడు అడ్డుపడి, "అదెలా సాధ్యం? ఈ ఓడలో మేము ఆరుగురం తప్ప సరుకులేవీ కనిపించడం లేదే!" అని అడిగాడు చిన్నగా నవ్వుతూ.

"అహా....హా....కుర్రాడివైనా తమాషాగా మాట్లాడుతున్నావే! ఇప్పుడు మన ఓడలో సరుకులు లేవుగాని, మీరు కాస్త సాయం చేశారంటే మనం ఆ ద్వీపం చేరేలోగా కావలసినన్ని సరుకులు సంపాయించగలం!" అన్నాడు గరళనాభుడు.

"ఏమిటీ! ఈ నడిసముద్రంలోనా! అదెలా సాధ్యం? అయినా, కుర్రవాళ్ళమయిన మేం చేయగల సహాయం ఏమిటి?" అని అడిగాడు సమీరుడు.

"మా ఓడను దోచుకున్న దొంగల ఓడ త్వరలో ఇటు కేసి వస్తుంది. మనం ఆ ఓడను సమీపించగానే, ఆపదలో వున్న సూచనగా నల్లజెండాను ఎగురవేస్తాను. మీరు ఓడలోని గదుల బయట నిలబడి, ఆ ఓడలోని వాళ్ళకు వినిపించే విధంగా గొంతెత్తి రక్షించమని ఆర్తనాదం చేయాలి," అన్నాడు గరళనాభుడు.

"ఆ తరవాత?" అని అడిగాడు సమీరుడు.

"మీ ఆర్తనాదాలు విని వర్తకుల వేషాలలో వున్న దొంగల ఓడ మన ఓడను సమీపిస్తుంది. అప్పుడు మీరు వాళ్ళతో, 'మా ఓడ మీద సముద్రపు దొంగలు పడి దోచుకున్నారు. ఆ దొంగలు మా పెద్దలతో సహా నావికులందరినీ చంపి వెళ్ళారు.' అని చెప్పి దీనంగా విలపించాలి. మీ మాటలు నమ్మి ఆ ఓడలో నుంచి కొందరు మన ఓడలోకి వస్తారు. వాళ్ళను మీరు తిన్నగా మేము కూర్చున్న గదిలోకి తీసుకురావాలి. ఆపైన జరగవలసింది మేము చూసుకుంటాం!" అన్నాడు గరళనాభుడు.

"అద్భుతమైన ఆలోచన!" అన్నాడు ఒక కుర్రవాడు.

"పథకం బాగున్నది కదా! మాతో సహకరించారంటే మిమ్మల్ని తగిన



విధంగా సత్కరించగలం!'' అన్నాడు గరళనాభుడు.

''చాలా సంతోషం. ఆపైన, మీరు ఆ వర్తకుల్ని ఏం చేస్తారు?'' అని అడిగాడు సమీరుడు.

గరళనాభుడు పెదవులు బిగబట్టి, కొంతసేపు మౌనంగా ఆలోచించి, గట్టిగా నిట్టూరుస్తూ, ''ఆ దుర్మార్గులు చేసిన ఘోరమైన అపకారానికి వాళ్ళను హతమార్చినా పాపంలేదు. కాని, వాళ్ళను చంపడానికి నా మనసు అంగీకరించడంలేదు. అందుకే, వాళ్ళ ఓడను దోచుకుని దానిని సముద్రంలో ముంచి, వాళ్ళను బందీలుగా పట్టుకుని వెళ్ళి బానిసల సంతలో అమ్మేస్తాం. చంపడంకన్నా వాళ్ళను బానిసలుగా విక్రయించడం వాళ్ళపై దయచూపినట్టేకదా!'' అన్నాడు గరళనాభుడు.

బానిసలసంత అన్న మాట వినగానే కుర్రవాళ్ళు భయకంపితులయ్యారు.

అంతలో గరళనాభుడి ముఖ్యానుచరుడు లోపలికి వచ్చి, ''ఓడ కనిపించింది!'' అన్నాడు అమితోత్సాహంగా.

''శభాష్! మన ఓడను త్వరగా దానికేసి నడిపించండి. ఆ ఓడలోని మనుషులు కనిపించగానే, మనవాళ్ళు తెడ్లను కుర్రవాళ్లకు అప్పగించి, ఎదుటివాళ్ల కంటబడకుండా ఒక గదిలో దాక్కోవాలి, వెళ్ళు!'' అని ఆజ్ఞాపించాడు గరళనాభుడు.

గరళనాభుడూ, కుర్రవాళ్ళూ భోజనం ముగించి, గదినుంచి బయటకు వచ్చారు. దూరంలో వర్తకుల ఓడ కనిపించింది. కొంతసేపు వాయువేగంతో ప్రయాణంచేసి వర్తకుల ఓడను సమీపించగానే, నాయకుడి ఆజ్ఞానుసారం, దొంగలు తెడ్లను కుర్రవాళ్ళకు అప్పగించి, లోపలికి వెళ్ళారు.

సమీరుడు, ఓడ తెరచాప కొయ్యకు అనుకుని వున్న పలకమీదికి ఎక్కి, వర్తకపు ఓడలోని వాళ్ళకు కనిపించే విధంగా నిలబడ్డాడు. అప్పుడు తాను ఉన్న

దొంగల ఓడలో నుంచి ఒక సముద్రపు కాకి, ఎగిరివెళ్ళి వర్తకపు ఓడలో వాలడం సమీరుడు గమనించాడు. దాని ద్వారా వాళ్ళకు అపూర్వమేదో సందేశం పంపి నట్టు సమీరుడు గ్రహించాడు.

అంతవరకూ అటూ ఇటూ తిరుగు తూన్న గరళనాభుడు తెరచాపకొయ్యకు నల్ల జెండాను కట్టి సమీరుడితో, "ఆ ఓడలోనుంచి వచ్చే వర్తకుణ్ణి, వాడి సహవర్తకుల్నీ మేమున్న గదిలోకి తీసుకు వచ్చే బాధ్యత నీది!" అని హెచ్చరించి, తన అనుచరులతో సహా లోపలి గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు.



సమీరుడు గొంతెత్తి, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టాడు.

ఆ కేకలు విని వర్తకపు ఓడలోని గదిలో నుంచి పెద్దమనిషిలాగా ఉన్న ఒక వర్తకుడు బయటికి వచ్చాడు. ఆయనకు ఇరువైపులా దృఢకాయులయిన అంగ రక్షకులు కొందరున్నారు.

"ఈ ఓడలో మేము అరుగురు కుర్రవాళ్ళమే ఉన్నాం. మావాళ్ళనందరినీ, సముద్రపు దొంగలు హతమార్చి వెళ్ళారు. మమ్మల్ని రక్షించండి, రక్షించండి!" అని సమీరుడు అరిచాడు.

వర్తకుల ఓడ మరుక్షణమే దొంగల ఓడ దగ్గరికి వచ్చింది. ఇద్దరు దృఢ కాయులు ఒక పొడవాటి పలకను తెచ్చి, రెండు ఓడలను కలుపుతూ వేశారు. వర్తకుడూ,మరి నలుగురుదృఢకాయులూ ఆ పలకమీదుగా నడిచివచ్చి, దొంగల ఓడలోకి దిగారు. వర్తకుడు సమీరుణ్ణి మెల్లగా, "ఎక్కడా దుర్మార్గులు?" అని అడిగాడు.

సమీరుడు దొంగలు దాక్కున్న గదిని చూపుతూ, "రండి బాబూ, రండి. దొంగలు వదిలివెళ్ళిన విలువైన సరుకులు ఇంకా కొన్ని ఆ గదిలో మిగిలి ఉన్నాయి. వాటన్నిటినీ మీరు తీసుకుని, మమ్మల్ని మా ఇళ్ళకు చేర్చండి, అదేచాలు!" అన్నాడు బిగ్గరగా.

"భయపడకండి మిమ్మల్ని రక్షించడానికే మేము వచ్చాం!" అంటూ వర్తకుడు దొంగలున్న గదిని సమీపించి, రెప్పపాటులో దాని తలుపులు మూసి తాళంవేశాడు. ఆ తరవాత ఆయన కిటికీగుండా లోపలికి తొంగి చూస్తూ, "దుర్మార్గులారా, మీపాపం పండింది. నాతోపాటు పాతికమంది దృఢకాయులు నాకు రక్షణగా ఉన్నారు. మీరెందరి ఓడల్లో దోచుకుని, అమాయకులను వేధించి క్రూరంగా సముద్రం పాలు చేశారు. ఆ పాపఫలితం ఇప్పుడు అనుభవించక తప్పదు. తప్పించుకోవాలని ప్రయత్నించారంటే ఆ క్షణమే మీ ఓడను భస్మంచేస్తాం. మావద్దపీపాలనిండా ఓడను తగలబెట్టడానికి కావలసినంత నూనె ఉన్నది. కిక్కురుమనకుండా కూర్చోండి. రేపీపాటికి తీరం చేరుకోగలం, అంత వరకూ మీకు తిండిలేదు. తాగడానికి మంచినీళ్ళు మాత్రం ఇస్తాం. కూర్చున్న చోటునుంచి కదిలారో ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

దొంగలున్న గదిచుట్టూ పదిమంది దృఢకాయులు కాపలాగా నిలబడ్డారు. మరి కొందరు దొంగల ఓడను తాళ్ళతో తమ ఓడకు కట్టి బిగించారు. కుర్రవాళ్ళు పట్టరాని ఆనందంపొందారు. సమీరుడు అపూర్వుడికోసం చుట్టుపక్కలపరిశీలించి చూస్తూండగా, వర్తకుడు, "నాయనా, ఒక సముద్రపు కాకితో ఎలా సందేశాన్ని పంపగలిగావు?" అని అడిగాడు అతని వెన్ను చరుస్తూ.

"ఆ సందేశం నేను పంపలేదు. మమ్మల్ని రక్షించడానికి వచ్చిన ఒక దివ్య పురుషుడు పంపాడు!" అన్నాడు సమీరుడు.

"ఎక్కడా మహానుభావుడు?" అని అడిగాడు వర్తకుడు.

"నాకూ తెలియదు. కాని, ఆయన త్వరలోనే మీ దగ్గరికి రాగలడు," అన్నాడు సమీరుడు.

ఓడలు రెండూ వేగంగా తీరంకేసి బయలుదేరాయి. —(ఇంకావుంది)






## అచ్యుతుడి ఆత్మాభిమానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం ప్రతిసారీ విఫలమవుతున్నా, నువ్వు నిరాశానిస్పృహలకు లోనుకాక పోవడం ఆశ్చర్యం కలిగిస్తున్నది. నీకు హెచ్చరికగా వుండేందుకు, ఒక సంగతి చెప్పదలిచాను. విద్యలునేర్చి పరిపాలనా దక్షుడైన ప్రతి రాజూ, సంస్కారవంతుడూ, నిరహంకారీ అనుకోవడం పొరబాటు. ఒకవేళ నీ శ్రమ అంతా, మిత్రుడైన తోటి రాజుకు మేలు చేయడం-కోసం అయితే, నువ్వు ముందుగానే తగు జాగ్రత్తలో వుండడం అవసరం. ఇందుకు ఉదాహరణగా, తన అహంకారం, మూర్ఖత్వంకొద్దీ, సహాధ్యాయీ, ఆత్మాభిమానీ అయిన

## బేతాళ కథలు




అచ్యుతుడనేవాణ్ణి, అవమానించి పంపిన హరిదత్తుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

మహేంద్రగిరి రాజ్యం రాజు శివదత్తుడికి, హరిదత్తుడు ఒక్కగానొక్క కొడుకు. శివదత్తుడు విద్యాభ్యాసం నిమిత్తం కొడుకును, చిత్రారణ్యంలోని దివ్యానందుడనే ఆచార్యుడి గురుకులానికి పంపాడు.

హరిదత్తుడు, దివ్యానందుడి వద్ద శ్రద్ధాసక్తులతో విద్యనభ్యసించసాగాడు. ఆ గురుకులంలో ఇంకా చాలామందివిద్యార్థులున్నారు. వాళ్ళల్లో అచ్యుతుడనేవాడితో, హరిదత్తుడికి మంచి స్నేహం కుదిరింది.

అచ్యుతుడిలో, హరిదత్తుడికి బాగా నచ్చిన అంశం, అతడి ఆత్మాభిమానం. హరిదత్తుడికి తండ్రివద్ద నుంచి తరచుగా రుచికరమైన వంటకాలూ, విలువైన వస్తువులూ వస్తూండేవి. వాటికోసం మిగతా విద్యార్థులు హరిదత్తుడి మీద ఎగబడేవారు. అయితే, అచ్యుతుడు మాత్రం, హరిదత్తుడు పిలిచి ఇచ్చినా స్వీకరించేవాడు కాదు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు దివ్యానందుడు, హరిదత్తుణ్ణి చేరబిలిచి, "నాయనా, నేటితో నీ విద్య ముగిసింది. రాజధానికి వెళ్ళి, రాజువయ్యాక ప్రజారంజకంగా పరిపాలనచేసి, మంచి రాజుగా పేరు తెచ్చుకో!'' అన్నాడు.

తాను రాజధానికి బయలుదేరేముందు హరిదత్తుడు, అచ్యుతుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకుని, "మనం విడిపోయే రోజు వచ్చింది. నీ ఎడబాటు నాకు మనస్తాపం కలిగిస్తుంది. సరే, నా జ్ఞాపకంగా, దీన్ని తీసుకో !'' అంటూ తన మెడలోని మణిహారం తీసి అచ్యుతుడికి ఇవ్వబోయాడు.

అయితే, అచ్యుతుడు దాన్ని తీసుకోక, "నాకీ మణిమాణిక్యాలకంటే, నీ స్నేహమే విలువైనది!'' అని హరిదత్తుడివ్వజూపిన హారాన్ని సున్నితంగా తిరస్కరించాడు.

అయితే, హరిదత్తుడు ఊరుకోక, "ఈ ఒక్కసారికి మాత్రం, నా కానుకను తీసి

పుచ్చుకు!'' అంటూ హారాన్ని అచ్యుతుడి మెడలో వేశాడు.

తర్వాత అతడు, అచ్యుతుడితో, ''నీకెప్పుడే అవసరం కలిగినా, నేనున్నానన్న సంగతి మాత్రం మరవకు!'' అని చెప్పి, రాజధానికి వెళ్ళిపోయాడు.

ఒక సంవత్సరం గడిచేలోపల రాజు శివదత్తుడు, ఒక శుభముహూర్తాన హరిదత్తుడికి పట్టాభిషేకం చేశాడు.

గురుకులంలో విద్య ముగించుకుని అచ్యుతుడు, తన విద్యకు తగిన ఉద్యోగం కోసం ప్రయత్నాలు చేశాడు. చివరకు అతడికి, ధనదీపుడనే ఒక పెద్ద జమీందారు కొలువులో, ఒక చిన్న ఉద్యోగం దొరికింది. అది అచ్యుతుడి విద్యకు తగిన ఉద్యోగం కాకపోయినా, భుక్తికి ఎలాంటి లోటూ లేకుండా సరిపోయింది.

ఒకనాడు అచ్యుతుడి వద్దకు, అతడి తండ్రి స్నేహితుడు శివనాథుడనే వృద్ధుడు వచ్చి, ''బాబూ! నన్నెరిగే వుంటావు. ఆ మధ్య బాగా జబ్బుచేసి మంచాన పడ్డాను. ఇల్లు జరుగుబాటు కష్టంగా వుంది. మహారాజు నీకు స్నేహితుడని విన్నాను. నా కొడుక్కు ఏదైనా చిన్న ఉద్యోగం ఇప్పించి పుణ్యం కట్టుకో,'' అని దీనంగా అడిగాడు.

అచ్యుతుడు, శివనాథుడి కొడుకు ప్రశాంతుడిని వెంటబెట్టుకుపోయి, రాజు



హరిదత్తుణ్ణి కలిసి సంగతి వివరించాడు. హరిదత్తుడు, ఆ యువకుణ్ణి సైన్యంలో భటుడుగా చేర్చుకునే ఏర్పాటు చేసి, అచ్యుతుడి యోగక్షేమాలు విచారించాడు. అచ్యుతుడు, తానిప్పుడు చేస్తున్న ఉద్యోగం గురించి చెప్పి, అది తనకు అన్నివిధాలా తృప్తికరంగా వున్నదన్నాడు.

ప్రశాంతుడికి, రాజు కొలువులో భటుడి ఉద్యోగం దొరకడంతో, అచ్యుతుడికి రాజు దగ్గిర వున్న పలుకుబడి గురించి చాలామందికి తెలిసిపోయింది.

అచ్యుతుడి గ్రామంవాడైన వీరబలుడనే వాడికి, రాజు కొలువులో ఉద్యోగం. వాడు లంచం తీసుకుంటూ అధికారులకు



చిక్కిపోయాడు. వాడు, అచ్యుతుణ్ణి కలుసుకుని, "మనం చిన్ననాటి స్నేహితులం. మహారాజుతో, ఈసారికి నా తప్పు కాయమని చెప్పు!" అని ప్రాధేయపడ్డాడు.

అందుకు అచ్యుతుడు, "తప్పుచేసినందుకు శిక్ష అనుభవించు. ఇటువంటి పనులకోసం, నేను మహారాజును కలవను," అని గట్టిగా చెప్పాడు.

ఈ విషయం మహారాజు చెవిన పడింది. ఆయన, స్నేహితుడి సత్యవర్తనకు చాలా సంతోషించాడు.

ఇలాంటి సమయంలోనే శ్రీచందుడనే పెద్ద వర్తకుడు, అచ్యుతుణ్ణి చూడవచ్చి, "మన రాజ్యంలో పత్తిపంట చాలా తక్కువని, నీకు తెలిసిందే! మన పొరుగు రాజ్యంలో పత్తి విపరీతంగా పండుతుంది. మనం పత్తిని అక్కడి నుంచి దిగుమతి చేసుకున్నామంటే, పేదలకు చాలా చౌకగా వస్త్రాలను అందించవచ్చు. అయితే, పత్తి దిగుమతికి రాజుగారి అనుమతి పత్రం కావాలి. అది సంపాయించిపెట్టు. ప్రతిఫలంగా, నా వ్యాపారంలో నీ పెట్టుబడి లేకపోయినా, వచ్చే లాభాల్లో నీకు నాలుగోవంతు వాటా ఇస్తాను," అన్నాడు.

అచ్యుతుడు కొంచెంసేపు ఆలోచించి, "నీవు తలపెట్టింది మంచిపని. నాకు నీ లాభంలో వాటా అవసరం లేదు," అని చెప్పి, రాజును కలిసి, సంగతి వివరించి, ఆయన నుంచి అనుమతి పత్రం సంపాయించి, శ్రీచందుడికిచ్చాడు.

అనుకున్న ప్రకారం శ్రీచందుడు, పొరుగురాజ్యం నుంచి పత్తిని దిగుమతి చేసుకుని, భారీ ఎత్తున వస్త్రాలు తయారు చేయించి, న్యాయమైన ధరకు అమ్మడం సాగించాడు. ఆర్నెల్లయినా తిరక్కుండానే, అతడికి విపరీతమైన లాభాలు వచ్చినై. శ్రీచందుడు ఎంత ఒత్తిడి చేసినా, అచ్యుతుడు, అతడి దగ్గిర నుంచి చిల్లిగవ్వ కూడా తీసుకోలేదు. ఈ విషయం కూడా హరిదత్తుడి చెవినపడింది.

ఇది జరిగిన తర్వాత, అనేకమంది ప్రతిదినం వచ్చి, అచ్యుతుణ్ణి కలుసుకో వడం, మహారాజుతో చెప్పి, సహాయం చేయ మని ప్రాధేయపడడం ఎక్కువైపోయింది. ఇలా వచ్చేవారిలో చాలా మంది స్వార్థ పరులు. మహారాజు స్నేహం తన మీద ఇంత ఒత్తిడికి కారణం అవుతుందని, అచ్యుతుడు ముందుగా ఊహించలేదు.

అచ్యుతుడి యజమాని అయిన జమీం దారు ధనదీపుడు, అచ్యుతుడు ఉద్యో గంలో చేరిననాటి నుంచీ, అతడి ప్రవర్త నను గమనిస్తూనే వున్నాడు. అచ్యుతుడి ఆత్మాభిమానం, నిజాయితీ ఆయనను బాగా ఆకర్షించాయి. అటువంటివాణ్ణి తన అల్లుడుగా చేసుకోవాలన్న నిర్ణయానికి వచ్చాడు ధనదీపుడు.

ఒకనాడు ధనదీపుడు తన మనసులోని మాటను అచ్యుతుడితో చెప్పాడు. అందుకు అచ్యుతుడు, ఒక్క క్షణం కూడా ఆలో చించకుండా, ''క్షమించండి! మీ అమ్మా యికి నేను తగను,'' అని తప్పుకున్నాడు.

అయినా, ధనదీపుడు అంతటితో ఊరుకోలేదు. ఆయన ఒకనాడు విందొకటి ఏర్పాటు చేశాడు. దానికి చాలామంది పురప్రముఖులు హాజరయ్యారు. ఆ సమ యంలో ధనదీపుడు, అచ్యుతుణ్ణి పక్కకు తీసుకుపోయి, ''మహారాజుకు నేను పెద్ద



మొత్తం పన్నులనిమిత్తం కట్టవలసివుంది. సమయానికి డబ్బు లేక జాప్యం చేశాను. ఆయన నా మీద గట్టిచర్య తీసుకోవాలని భావిస్తున్నట్టు తెలిసింది. నువ్వు, మహా రాజును దర్శించి, నాకు కొంత వ్యవధి ఇవ్వమని కోరు,'' అన్నాడు.

''పన్నులు సకాలంలో చెల్లించవలసిన బాధ్యత మనది. దాన్ని మన ఇబ్బంది లకు ముడిపెట్టి జాప్యం చేయడం తగదు కదా! ఈ విషయంలో నేనేమీ మహా రాజుకు చెప్పలేను,'' అన్నాడు.

ఇందుకు ధనదీపుడు, ''అచ్యుతా! ఆ మధ్య మహారాజు వృద్ధులకూ, వితంతు వులకూ నెలనెలా ధనసహాయ పథకం



ప్రవేశపెట్టాడు కదా! మరి అందులో జాప్యం జరగడంలేదా? అదెంతవరకు సమంజసం?'' అని ప్రశ్నించాడు.

''ఈ విషయంలో హరిదత్తుణ్ణి తప్పు పట్టకతప్పదు. అయినా, ఆయన తప్పు చేశాడని, మనమెందుకు తప్పు చేయాలి?'' అన్నాడు అచ్యుతుడు.

ఆ సమాధానం విన్న ధనదీపుడు నవ్వి, ''అచ్యుతా! ఈ విందుకు వచ్చినవారిలో, మహారాజుగారి చారులు కూడా వున్నారు. వాళ్ళు మన మధ్య జరిగిన సంభాషణను, ఆయనకు చేరవేస్తారు. మహారాజును తప్పు పట్టినందుకు, తప్పక మీ ఇద్దరి స్నేహం చెడి తీరుతుంది,'' అన్నాడు.

''మీరు పొరబడ్డారు. నా విమర్శలోని సత్యాన్ని హరిదత్తుడు తప్పక గ్రహించి, తన తప్పును సరిదిద్దుకుంటాడు,'' అన్నాడు అచ్యుతుడు.

ఆ మాటకు ధనదీపుడు, ''సరే! నువ్వొకసారి వెళ్ళి మహారాజును కలుసుకో. ఆయన ప్రవర్తనలో మార్పు లేకపోతే, మీ స్నేహాన్ని అభినందిస్తాను. అలా కానప్పుడు నువ్వు ఓడిపోయినట్టు ఒప్పుకుని, నా కుమార్తెను పెళ్ళాడు,'' అన్నాడు.

అచ్యుతుడు ఇందుకు ఒప్పుకుని, రాజు హరిదత్తుణ్ణి కలిశాడు. హరిదత్తుడు, అచ్యుతుణ్ణి చూస్తూనే మండిపడి, ''అచ్యుతా! నన్నే విమర్శించేటంత గొప్పవాడివైపోయావా? నీ స్థానం సంగతి మరిచి, స్నేహధర్మం పాటించినందుకు, నాకు తగిన పాఠం నేర్పావు. మరెన్నడూ నన్ను చూసేందుకు రాకు,'' అన్నాడు.

అచ్యుతుడు, ధనదీపుడి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పి, ఆయన కుమార్తెను వివాహమాడాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అచ్యుతుడు అతిచిన్న ఉద్యోగం చేస్తూ కూడా, తన మిత్రుడైన మహారాజు సహాయం కోరక, మరొకడు ఉద్యోగం సంపాయించేందుకు సహాయపడ్డాడు.

లంచగొండి తన స్నేహితుడే అయినా, అతణ్ణి మన్నించమని రాజును కోరలేదు. వర్తకుడు శ్రీచందుడు లాభంలో వాటా ఇస్తానన్నా తిరస్కరించాడు. ఇదంతా ఎరిగివుండీ రాజు హరిదత్తుడు, అచ్యుతుడు చేసిన విమర్శలోని నిజం గ్రహించకుండా, అతడిపై ఆగ్రహించాడంటే— అందుకు కారణం అహంకారం, మూర్ఖత్వాలేనా లేక మరేదైనా కారణం వున్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చిన్ననాటి గురుకులంలో అచ్యుతుడి సహాధ్యాయి అయిన హరిదత్తుడికి, అచ్యుతుడెంతటి ఆత్మాభిమానో, నిజాయితీపరుడో బాగా తెలుసు. అతడు చేస్తున్నది, ఏమాత్రం ఎదుగూబొదుగులు లేని చిన్న ఉద్యోగమే అయినా, తను ఆస్థానంలో మంచి ఉద్యోగం ఇస్తానంటే, అతడు అంగీకరించడన్న భయంతోనే, ఆ సంగతి అచ్యుతుడితో అనలేదు. పైగా పులి మీద పుట్రలాగా, తనతో అతడికి గల స్నేహాన్ని, ఇతరులు తమ స్వార్థం కోసం ఉపయోగించుకునేందుకు, అతడి మీద నానా వత్తిళ్ళు తెస్తున్నారు. ఇలాంటి సమయంలో రాజు హరిదత్తుడికి, తన చారుల ద్వారా జమీందారు, అచ్యుతుడితో కట్టిన పందెం గురించి తెలిసింది. తన నుంచి సహాయం కోరే పొరుగువాళ్ళ బలవంతాల నుంచి బయటపడి, జమీందారు కుమార్తెను పెళ్ళాడి, జీవితంలో సుఖపడగలడనే గట్టి నమ్మకంతోనే, ఆయన అచ్యుతుడిపైన లేని ఆగ్రహం నటించాడు. ఈ అన్ని కారణాలవల్లా, రాజు హరిదత్తుడు అహంకారీ, మూర్ఖుడూ కాకపోగా, గొప్ప వివేకీ, స్నేహశీలీ అని తెలుస్తున్నది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]



# పుర్రెతో పుట్టిన బుద్ధి

పరమపిసినారి జమీందారు పాపారాయుడికి, ఎప్పుడైనా గుడికి వెళితే పూజారికి దక్షిణగా ఏదైనా ఇవ్వడం, దేవుడికి కొబ్బరికాయ పగల గొట్టడం, పాదరక్షల కాపలా కుర్రాడికి ఏదైనా ఇవ్వడం, ఇష్టముండేది కాదు.

జమీందారు పిసినారి తత్వం బాగా ఎరిగిన పూజారి గురులింగయ్య, ఆయనను నోరెత్తి ఏమీ అడిగేవాడు కాదు.

ఒక మహాశివరాత్రి పర్వదినాన, జమీందారు పాపారాయుడు మొదటి వ్యక్తిగా గుడికి రావడమే కాక, పూజారి గురులింగయ్యకు, ఒక కానీ దక్షిణగా పళ్ళెంలో వేశాడు.

అంత చిన్న బోణీతో మనసు బాధపడ్డ పూజారి గురులింగయ్య, జమీందారుతో, "తమ వంటి గొప్పవారినుంచి కానీ దక్షిణగా స్వీకరించడం, నాకెంతో అవమానంగా వుంది! దయచేసి మరొక కానీ దక్షిణగా ఇవ్వండి," అన్నాడు.

ఆ మాటలతో ఒళ్ళు మండిన పాపారాయుడు, "ఇంకొక కానీ ఇచ్చి, మళ్ళీ రెండోసారి మిమ్మల్ని అవమానించడం, నాకూ ఇష్టం లేదు!" అంటూ ఇచ్చిన కానీ తీసుకుని గుడి బయటికి నడిచాడు.

—ఎం. డి. సౌజన్య






## మన దేవుళ్ళు:

# మహాకాళి

సృష్టి స్థితి లయాలకు మూలకారణమైన దివ్యశక్తిని మన ప్రాచీన ఋషులు భిన్న రూపాలలో సందర్శించారు. నిర్మల ప్రశాంతవదనంతో మంచిని రక్షించే దివ్యమాత—చెడునూ, దుర్మార్గాన్నీ భీకర రూపంతో నిర్మూలిస్తుంది. ప్రపంచ సృష్టి మాత్రమే కాదు; విలయం కూడా దివ్యశక్తి సంకల్పానుసారమే జరుగుతుందని మన పూర్వులు విశ్వసించారు. సంహారశక్తికి రూపకల్పనే మహాకాళి!

మహాకాళి నల్లటి రంగుతో, పులిచర్మం ధరించి, మెడలో కపాలమాల, నాలుగు చేతులలో మారణాయుధాలతో అతి భీకరంగా కనిపిస్తుంది. అయితే, భక్తి శ్రద్ధలతో, అచంచల విశ్వాసంతో కొలిచే వారిని, అ రూపంలోనూ అమ్మలా అదరించి విజయాలను ప్రసాదిస్తుందని భక్తులు విశ్వసిస్తారు!

లోక కంటకులను సంహరించడానికి, మహాకాళి అవతరించిన శుభ సందర్భాన్ని పురస్కరించుకుని భక్తులు విజయదశమి వేడుకలను దేశమంతటా ఘనంగా జరుపుకుంటారు!




# పదమూడోయేట పట్టభద్రుడు!

బాలమురళీకృష్ణ అంబటి అనే ఒక భారతీయ విద్యార్థి, సరికొత్త రికార్డును స్థాపించి, అమెరికాలో నూతన చరిత్రను సృష్టించాడు. అపూర్వమయిన తెలివితేటలు ప్రదర్శించిన ఆ కుర్రవాడికి న్యూయార్క్ విశ్వవిద్యాలయం జీవశాస్త్రంలో డిగ్రీ ప్రదానం చేసింది. ఆ కుర్రవాడి వయసు పదమూడేళ్ళే! నూట అరవై సంవత్సరాల చరిత్రగల న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడయిన అతి పిన్న వయస్కుడు బాలమురళీకృష్ణఅంబటి!

మే నెలలో జరిగిన స్నాతకోత్సవంలో దాదాపు పదివేలమంది డిగ్రీలు పుచ్చుకున్నారు. అప్పుడు బాలమురళీకృష్ణ అంబటికి డిగ్రీ ఇవ్వడంతో పాటు, అతన్ని 'సిల్వర్ టార్చ్'తో ప్రత్యేకంగా గౌరవించారు.

'బాల' తల్లిదండ్రులు ఇరువురూ మన దేశంలోనే ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. పువ్వు పుట్టగానే పరిమళించినట్టు, బాలమురళి నాలుగేళ్ళ ప్రాయంలోనే 'కాల్కులస్' ప్రాథమిక సూత్రాలను నిర్దుష్టంగా నేర్చుకున్నాడు. పిల్లవాడి తెలివితేటలను గమనించిన తల్లిదండ్రులు అప్పటినుంచే ప్రోత్సహిస్తూ వచ్చారు.

బాలమురళి, తన పదకొండవయేట తనకన్నా ఆరేళ్ళు పెద్దవాడైన అన్నయ్య, జయకృష్ణఅంబటితో కలిసి, 'ఎయిడ్స్' మీద ఒక పుస్తకం ప్రచురించి మరొక రికార్డు సృష్టించాడు. అప్పుడే అతడు న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో ప్రవేశం కోసం దరఖాస్తు పంపాడు.

ప్రస్తుతం ఇజ్రాయెల్‌కు చెందిన ఒక యువకుడు, పద్దెనిమిదవయేట డాక్టర్ డిగ్రీ పూర్తిచేసి, ప్రపంచంలోకెల్లా అతి పిన్న వయసు డాక్టర్‌గా వుంటున్నాడు. కాబట్టి పద్దెనిమిదేళ్ళకు ముందే డాక్టర్ డిగ్రీ సంపాయించి ఆ రికార్డును అధిగమించాలన్న లక్ష్యంతో బాలమురళీకృష్ణ అంబటి కృషిచేస్తున్నాడు.

కాలానికి ఎదురీదుతూన్న ఈ బాల మేధావి ఉన్నత లక్ష్యం నెరవేరాలని ఆశిద్దాం!

# మీకు తెలుసా?

1. సున్నాను కనుగొన్న ప్రాచీన భారతీయ గణిత శాస్త్రవేత్త ఎవరు?
2. 'నీటి గుర్రం' గుర్రంకాదు. ఏమిటది?
3. టోక్యో నగరం మొదటి పేరేమిటి?
4. క్రీ. శ 312వ సంllలో కాన్‌స్టాన్టిన్ చక్రవర్తి ప్రవేశపెట్టిన రోమను నాణెం 14 శతాబ్దాలపాటు చెలామణిలో ఉన్నది. ఆ నాణెం ఏది?
5. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద గ్రంథాలయం ఏది?
6. యూరపులో జన్మించి, ఆసియాలో మరణించి, ఆఫ్రికాలో సమాధి చేయబడిన రాజు ఎవరు?
7. షేక్స్‌పియర్ నాటకాలలోకెల్లా చాలా పెద్దది ఏది?
8. జాతీయపతాకంలోనే తన దేశ చిత్రపటం కలిగిన దేశం ఏది?
9. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించినప్పుడు, ఎడ్మండ్ హిల్లరీ, టెన్సింగ్‌నార్గే అక్కడ నాలుగు జెండాలను నాటారు. జెండాలు ఏవి?
10. హెన్రీ ఆర్చర్ కనిపెట్టిన యంత్రాన్ని తపాలా బిళ్ళల తయారుచేసే అచ్చు యంత్రాలలో ఉపయోగిస్తారు. దాని పేరేమిటి?
11. గెలీలియో మొట్టమొదట కనుగొన్న విజ్ఞాన సిద్ధాంతం ఏది?
12. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడవడానికి చార్లెస్ డార్విన్ చదువుకున్న పాఠ్యాంశం ఏది?
13. భారతదేశాన్ని పర్యటించిన మొట్టమొదటి అమెరికా అధ్యక్షుడెవరు?
14. భూమి సూర్యుణ్ణి ఒకసారి చుట్టిరావడానికి ఎంతకాలం పడుతుంది?
15. ఎవరెస్టు శిఖరంలో ఎక్కువభాగం ఉన్న శిల ఏది?

## సమాధానాలు

1. ఆర్యభటుడు.
2. గుర్రంతల ఆకారంలో నిలువున ఈదే సముద్రపు చేప.
3. ఈడో.
4. సోలిడస్.
5. మాస్కోలోని లెనిన్ స్టేట్ లైబ్రరీ.
6. అలెగ్జాండర్ చక్రవర్తి. యూరపు ఖండంలోని గ్రీసు దేశం మెసిడోనియాలో జన్మించాడు. ఆసియా ఖండంలో బాగ్దాద్ సమీపంలోని బాబిలోనియాలో మరణించాడు. ఆఫ్రికా ఖండంలోని ఈజిప్టుదేశ అలెగ్జాండ్రియాలో భౌతికకాయాన్ని సమాధిచేశారు.
7. హేమ్లెట్. 29,500 పదాలున్నాయి.
8. సైప్రస్.
9. ఐక్యరాజ్య సమితి, గ్రేట్ బ్రిటన్, నేపాల్, ఇండియా.
10. పర్‌ఫొరేటింగ్ మిషన్.
11. లోలకం.
12. మతశాస్త్రం.
13. డ్వైట్ డి. ఐసన్‌హోవర్ 1959 వ సంllలో.
14. 365 రోజులా, 5 గంటలా, 48 నిమిషాలా 46 సెకండ్లు.
15. సున్నపురాయి.

# చందమామ కబుర్లు



## లండన్ జంతు ప్రదర్శనశాల విజ్ఞప్తి!

ప్రపంచంలోకెల్లా అతి పురాతనమైనది లండన్‌లోని జంతు ప్రదర్శనశాల. 160 సంవత్సరాలుగా నడుస్తూన్న ఈ లండన్ జూ గత రెండేళ్ళుగా ఇబ్బందులకు లోనవుతున్నది. ఈ జూ కొనసాగాలంటే 40 మిలియన్ పౌండ్లు కావలసివుంటుందని దాని నిర్వాహకులు భావిస్తున్నారు. కాని, బ్రిటిష్ ప్రభుత్వం అందుకు సుముఖత చూపడంలేదు. అందుచేత, జూ నిర్వాహకులు — ప్రపంచ వ్యాప్తంగా వున్న అభిమానులకు, ముఖ్యంగా ధనాన్ని పొదుపు చేసుకున్న పిల్లలకు, విరాళాలు పంపమని విజ్ఞప్తి చేశారు. లేకుంటే, ఇక్కడి జంతువులను వేర్వేరు స్థలాలకు తరలించవలసిన నిర్బంధం ఏర్పడుతుందని ప్రకటించారు.

## 'ప్రభువు' భాష!

బైబిల్‌లోని ఏసుక్రీస్తు సూక్తులను ప్రపంచ భాషలన్నిటిలోకీ అనువదించారు. ఏసు ప్రభువు ఆరామిక్ భాషలో తన సిద్ధాంతాలను బోధించాడు. ఇప్పుడు ఆరామిక్ భాష పూర్తిగా నశించిపోయే స్థితిలో ఉన్నది. ఎందుకంటే, ఆ భాషను ప్రస్తుతం — సిరియాలోని డెమాస్కస్‌కు ఉత్తరంగా వున్న మౌలాలా పట్టణ పరిసర ప్రాంతాలలో నివసిస్తూన్న కొన్నివేల మంది మాత్రమే మాట్లాడుతున్నారు. దానికి లిపి లేదు. కాబట్టి రాయడం, చదవడం సాధ్యంకాదు. సిరియాలో సిరియక్, హిబ్రూ భాషలతో పాటు అరబిక్ అధికార భాషగా ఉన్నది. ఆరామిక్ భాషను మౌఖికంగా బోధించడంవల్ల, అది కొనసాగుతున్నది.




## 'గోల్ఫ్' ఆటకు బహుమతులు జంతువులు!

ఇటీవల మలేసియాలో జరిగిన 'గోల్ఫ్' పోటీలలో విజేతలకు బహుమతులుగా ధనంగాని, ట్రోఫీలుగాని ఇవ్వలేదు. ఆ పోటీలలో ఛాంపియన్‌కు ఒక ఆవునూ; రెండవ, మూడవ బహుమతులుగా గొర్రెలనూ, నాలగవ, ఐదవ స్థానాలలో వచ్చినవారికి జత కుందేళ్ళనూ, బహుమతులుగా ఇచ్చారు. 'హోల్-ఇన్-ఒన్' సాధించిన క్రీడాకారుడికి ఒక గుర్రంతోపాటు నాలుగు చక్రాలబండిని బహుమతిగా నిర్ణయించారు. కాని, దానిని ఎవరూ గెలుచుకోలేదు. 'గోల్ఫ్' క్రీడాకారులలో వ్యవసాయంపట్ల, జంతువులపట్ల ఆసక్తిని కలిగించడానికి ఈ వింత బహుమతులను ప్రవేశపెట్టినట్టు, వ్యవసాయ మంత్రి తెలియజేశారు.






# మంత్రపు చెవి

జపాను దేశంలో ఒక యువకు డుండే వాడు. అతను ఒకనాడు సముద్ర తీరాన నడుస్తూ ఉండగా ఇసుకలో ఒక మడుగులో ఒక చేప తన్నుకుంటూ ఉండటం కన పడింది. అది సముద్రపు పోటులో ఒడ్డుకు కొట్టుకు వచ్చి ఆ మడుగులో చిక్కుకుని, తిరిగి సముద్రంలోకి వెళ్ళలేకపోయింది.

యువకుడా చేపను చూసి జాలిపడి, దాన్ని ఎత్తుకుపోయి సముద్ర జలంలో వదిలేసి, ఒక ప్రాణికి సహాయపడ్డాను గదా అన్న సంతోషంతో వెళ్ళిపోతూండగా వెనక నుంచి ఎవరో, "కొంచెం ఆగు!" అని కేక పెట్టారు.

అతను వెనక్కు తిరిగి చూసే సరికి ఎవరో స్త్రీ కనిపించింది. అత నామె నెన్నడూ చూసి ఉండని కారణం చేత ఆమె పిలుస్తున్నది తనను కాదనుకుని అతను మళ్ళీ తన దారి పట్టాడు.

"నిన్నే! కొంచెం ఆగు!" అని ఆ స్త్రీ మళ్ళీ పిలిచింది.

అతను ఆశ్చర్యపడుతూ ఆగి ఆమె వద్దకు తిరిగి వెళ్ళాడు.

"సముద్ర రాజు నన్ను పంపాడు. ఆయన ఏకైక పుత్రిక ప్రాణాలను నీవు కాపాడావు. మా దేశానికి నిన్ను వెంట బెట్టుకుపోవటానికి నన్ను పంపారు దయ చేసి నా వెంట రా," అన్న దామె.

"నాకు ఈదటం రాదు. సముద్ర రాజ్యానికెలా రాగలను?" అన్నాడు యువకుడు.

"ఆ భయం నీకు వద్దు. నేను వాస్త వంగా చేపనే. నా వీపు మీద ఎక్కావంటే నిన్నక్కడికి ఏ ప్రమాదం జరక్కుండా తీసుకుపోతాను," అన్న దామె.

ఇద్దరూ కలిసి మోకాలు లోతు నీటిలోకి వెళ్ళాక, ఆ ఆడమనిషి పెద్ద చేపగా మారి

జపాను జానపద కథ

పోయింది. యువకుడామె వీపు పైన ఎక్కాడు. సముద్ర రాజుండే చోటికి వెళ్ళే దారిలో ఆ చేప యువకుడితో, ''సముద్ర రాజు నిన్నేదైనా వరం కోరమంటే మంత్రపు చెవి తప్ప మరేమీ అక్కర్లేదని చెప్పు. తన కూతురి ప్రాణం కాపాడావన్న కృతజ్ఞత కొద్దీ దాన్ని ఆయన నీ కిస్తాడు. దాన్ని చెవిలో పెట్టుకుని ఆలకిస్తే అన్ని ప్రాణుల భాషలూ నీకు బాగా అర్థమవుతాయి,'' అన్నది.

సముద్ర రాజు యువకుడికి గొప్పగా ఆతిథ్యం జరిపాడు. నృత్య గానాలు జరిగాయి. యువకుడు సముద్రరాజు అతిథిగా కొన్నాళ్ళుండి, ఇంక తన ఇంటికి వెళ్ళిపోతానన్నాడు. అప్పుడు సముద్ర రాజు, ''మా లోకం నుంచి నీ కిష్టమైనది కోరు, బహుమానంగా ఇస్తాను,'' అన్నాడు.

''నాకు మంత్రపుచెవి తప్ప మరేమీ వద్దు,'' అన్నాడు యువకుడు.

''సముద్రంలో అలాటిది ఒకే ఒకటి ఉన్నది. అయినప్పటికీ, నీవు కోరావుగనక దాన్ని నీ కిస్తాను,'' అంటూ ఒక గూట్లో వున్న మంత్రపు చెవిని యువకుడి కిచ్చేశాడు. అతన్ని సముద్ర రాజ్యానికి తెచ్చిన చేపే అతన్ని ఒడ్డుకు చేర్చి పోయింది.

యువకుడు సముద్రం ఒడ్డున ఒంటరిగా కూర్చుని ఉండగా కొన్ని పిచ్చుకలు కిచకిచలాడుతుండటం అతనికి వినపడింది. అవి ఏమంటున్నాయో తెలుసుకోవాలని కుతూహలం కలిగి, బుల్లి శంఖం లాగా ఉన్న



మంత్రపు చెవిని తన చెవిలో పెట్టుకున్నాడు. వెంటనే అతనికి పిచ్చుకలంటున్నది అర్థమయింది.

"మనుషులు మహా తెలివిగల వాళ్ళమనుకుంటారు. కాని వాళ్ళ కేమీ తెలీదు. ఈ పక్కనే ఉన్న వాగు మధ్యలో జనం కాలు వేసి దాటి పోయే రాయి అచ్చమైన బంగారం. ఆ సంగతి ఒక్కడికీ తెలీదు," అంటూ పిచ్చుకలు తమలో తాము నవ్వుకుంటున్నాయి.

ఈ సంగతి విని యువకుడికి మితి లేని ఆశ్చర్యం కలిగింది. అతను వాగు వద్దకు వెళ్ళి, దాని మధ్యలో ఉన్న రాతిని ఎత్తి, దాని పైన పేరుకుని ఉన్న పాచిని కడిగే సరికి తళతళా మెరుస్తూ బంగారం బయట పడింది. పిచ్చుకలు అన్న మాటలో అసత్యం ఏమీ లేదు.

యువకుడా బంగారాన్ని జేబులో పెట్టుకుని, తన అదృష్టానికి ఆశ్చర్యపడుతూ ఇంటికి పోతూండగా రెండు కాకులు, "కా, కా," అని అరవటం వినిపించింది. అతను మంత్రపు చెవిని తీసి తిరిగి తన చెవిలో పెట్టుకుని కాకులు చేస్తున్న సంభాషణ విన్నాడు.

"మనుషులు వట్టి మూర్ఖులు. ఎక్కడెక్కడి వైద్యులనూ పిలిపించారు, కాని ఒక్కడు కూడా జమీందారుగారి పిల్లకు నయం చెయ్యలేకపోయారు. ఎలా నయం చేస్తారూ? అది మందులతోనూ మాకులతోనూ నయమయ్యే వ్యాధి అయితేగద?



జమీందారుగారి ఇల్లు తిరగ వేసేటప్పుడు, గడ్డితో బాటు ప్రమాదవశాన ఒక పాము కూడా కట్టులో చిక్కుకుపోయింది. అది తిండికి మాడి కృశించి పోతున్నది. దాన్ని ఎవరైనా విడిపించి ఆహారం పెడితేనేగాని జమీందారుగారి కూతురు వ్యాధి నుంచి కోలుకోదు,'' అంటూ కాకులు తమలో తాము మాట్లాడుకున్నాయి.

ఈ మాటలు తన చెవిన పడటం మేలయిందనుకుని యువకుడు తిన్నగా జమీందారింటికి వెళ్ళాడు.

''నా కుమార్తెకు చికిత్స చేసి, వ్యాధి నయం చేసిన వారికి కోరినది ఇవ్వబడును," అని ఇంటిబయట రాసి ఉన్నది.

యువకుడు లోపల ప్రవేశించి, ''జబ్బుగా ఉన్న అమ్మాయికి చికిత్స చేస్తాను,'' అన్నాడు.

అక్కడ చేరి ఉన్న వైద్యులంతా విరగబడి నవ్వి, ''మనందరికీ అంతుచిక్కని వ్యాధిని ఈ మడ్డి వెధవ నయం చేస్తాట్ట!'' అని యద్దేవా చేశారు. కాని జమీందారు మాత్రం ఎవరు వైద్యం చేస్తామన్నా చేయించటానికి సిద్ధంగానే ఉన్నాడు.

యువకుడు లోపలికి వెళ్ళి రోగిని చూసి, ''ఇది రోగం కాదు, శాపం. జీవహింస జరిగింది. ఇంటి కప్పులో పాము బంధించబడి ఉన్నది,'' అన్నాడు.

జమీందారు తన నౌకర్లను పిలిపించి కప్పు విప్పించాడు. పాము ఒక కట్టలో కనిపించింది. అది తిండికి మాడి కొన ప్రాణంతో ఉన్నది. దాన్ని కట్ట నుంచి ఊడదీసి తెచ్చి పాలు పోశారు. అది పాలు తాగి బలం వచ్చి ఒక అడుగు పాకేసరికి, మంచంలో జమీందారు కూతురు లేచి కూర్చున్నది; పాము రెండడుగుల దూరం పాకే సరికి పిల్ల లేచి నిలబడింది. పాము తన దారిన ఎటో వెళ్ళిపోయింది. దానితోనే జమీందారు కూతురి వ్యాధి కూడా పోయింది.

తన కూతురికి చికిత్స చేసినందుకు బహుమానంగా జమీందారు యువకుడికి ఆ పిల్లనే ఇచ్చి పెళ్ళి చేశాడు.





# తగిన గురువు

పూర్వం భార్గవుడనే గ్రామాధికారికి లేక లేక పుట్టిన ఒకే ఒక కొడుకు దీపకుడు. కొడుక్కి మంచి విద్యాబుద్ధులు చెప్పించి ప్రవీణుడుగా చేయాలని తండ్రి కోరిక. సమర్థుడైన గురువు ఎక్కడ దొరుకుతాడా అని ఆలోచనలో పడ్డాడు భార్గవుడు.

దీపకుడు చాలా చురుకైనవాడు, తెలివైనవాడు. ఏ విషయమైనా ఒక్కసారి వింటే పట్టుకుంటాడు. వయసుకు మించిన ప్రశ్నలు ఎన్నో వేస్తూంటాడు. వాటికి జవాబు చెప్పాలంటే తండ్రికీ చేతకాదు, మరెవరికీ సాధ్యం కాదు. ఇంత గ్రహణ శక్తి గల బాలుడికి విద్య చెప్పే గురువు సామాన్యుడైతే లాభం లేదు. కనుకనే భార్గవుడు కష్టపడి తగిన గురువు కోసం వెతకవలసి వచ్చింది. తన గ్రామంలోనే ఒక గురుకులం వుంది. కాని అది పసివాడి బుద్ధిబలం వృద్ధి చేయగలది కాదు.

అక్కడికి రెండామడల దూరంలో శిలా పీఠమనే ఊరిలో కర్మఠీయుడనే వృద్ధుడి గురుకులముంది. ఆయన శిష్యులందరూ ప్రతిభావంతులై పేరు పొందుతున్నారని చాలామంది చెప్పారు. కాని భార్గవుడికి సందేహం పట్టుకుంది.

అంత గొప్ప గురువైతే గ్రామంలో ఎందుకు పడివుంటాడు? అటువంటివాడి పోషణకు గ్రామస్థులంతా పోగుచేసి ఏపాటి ఇవ్వగలరు? గొప్పవాడే అయితే బస్తీ చేరుకుని బోలెడంత సంపాదించడా? పోనీ, నగరానికి తీసుకుపోయి అక్కడి గురుకులంలో పిల్లవాడిని వదులుదామంటే, ఎడబాటుకు సహించడం కష్టమనుకున్నాడు భార్గవుడు.

ఏమైనా కానీ, ఇంతమంది చెప్పే విషయాన్ని నిర్లక్ష్యం చేసి ఊరుకోవటం భావ్యం కాదు. ఒకసారి చూసి వస్తే



పోయేది లేదు కదా అని తలిచి, ఒకనాడు భార్గవుడు మంచిది చూసుకుని, కానుకలు చేత పట్టుకుని, కొడుకును వెంట బెట్టుకు బయల్దేరాడు. చీకటిపడే వేళకు ఆ గురుకులం చేరుకున్నాడు. ఆసరికి కర్మతీయుడు దగ్గరలో చెరువుకు స్నానానికి వెళ్ళి ఉన్నాడు. ఇంట్లో వున్న ఆయన భార్యా, బిడ్డలూ అతిథుల్ని చక్కగా ఆదరించారు.

తను కూడా చెరువుకు వెళతానని కుతూహలపడ్డాడు భార్గవుడు. గురువుగారి పెద్ద కొడుకూ, ఆరేళ్ళ మనవడూ ఆయన్ని చెరువుకు తీసుకుపోయారు. వీళ్ళు వెళ్ళేటప్పటికి బట్టలుతుకుతూ కనిపించిన కర్మతీయుడికి భార్గవుడు నమస్కరించాడు.

క్షేమాదికాలైనతరువాత, "గురూత్తమా! ముఖ్యమైన రెండు రంగుల్లోనూ మీకు రెండోదే చాలా ముఖ్యమా?'' అని అడిగాడు భార్గవుడు.

''రెండూ చాలా ముఖ్యమే. ఇది లేకపోతే అది లేదు, అది లేకపోతే ఇది లేదు,'' అంటూ గురువు జవాబు చెప్పాడు.

పక్కనే వున్న గురువుగారి మనవణ్ణి చూసి భార్గవుడు, ''అబ్బాయీ! మా మాటలు నీకు అర్థమైనాయా?'' అన్నాడు.

అందుకా పిల్లవాడు, ''అర్థం కాకేం? 'పగటికన్నా రాత్రే మీకు చాలా ముఖ్యమా?' అని మా తాతయ్యను మీరడిగారు. 'రెండూ ముఖ్యమే' నన్నారు తాతయ్య,'' అని చెప్పాడు.

తరవాత భార్గవుడు, ''నిండు పన్నెండూ ఉండగా, మీవంటి వృద్ధులు ఆరోవంతులో బాధపడటమెందుకు స్వామీ?'' అని మళ్ళీ ఆయన్ని ప్రశ్నించాడు.

అందుకు కర్మతీయుడు, ''నేను పుట్టిన తరవాత, చచ్చి మళ్ళీ పుట్టిన ముప్ఫయి రెండు సంతతు లింకా బతికే వున్నాయి. అందుకే,'' అని బదులు చెప్పాడు.

ఈ సంభాషణలో భావ మేమిటని భార్గవు డీసారి గురు పుత్రుణ్ణి అడిగాడు.

అందుకతడు ఇలా చెప్పాడు: "మీరు మా నాన్నగారిని 'శిశిర రుతువైన ఈ చలిలో ఎందుకు కష్టపడతారీ వృద్ధాప్యంలో!' అని ప్రశ్న వేశారు. దానికి మా తండ్రి 'నాకు పళ్ళన్నీ దృఢంగా వుండి జీర్ణశక్తికి తోడ్పడుతున్నాయి. కనుకనే ఈ శీతలాన్ని భరించే శక్తి నాకున్నది' అని బదులిచ్చారు," అన్నాడు.

తరవాత భార్గవుడు మళ్ళీ కర్మఠీయుణ్ణి ఉద్దేశించి, "అయ్యా, తరుచు ఇళ్ళు కడుతూ, పడగొడుతూండేవాళ్ళు ఎందరున్నారండీ?" అని అడిగాడు.

దానికి గురువు, "అటువంటి పని చేసి చేసి, మానుకున్నవాళ్ళు నలుగురు. ఇప్పుడు వాళ్ళ తరఫువాళ్ళు ఆ పని చేస్తున్నారు," అంటూ జవాబు చెప్పాడు.

ఈ ప్రశ్నకు కూడా గురువుగారి కొడుకే వివరణ చెప్పాడు: "'మీ ఇంట్లో చిన్నపిల్ల లెంతమంది?' అని ప్రశ్న. అందుకు మా నాన్నగారు, 'నాకు నలుగురు కొడుకులు, చాలామంది మనమలూ,' అని సూచించారు," అన్నాడు.

మళ్ళీ భార్గవుడు, "స్వామీ! మీరు తరుచుగా కాంతికన్యను తెస్తూ వుంటారనుకొంటాను. నా మాట నిజమేనా?" అని అడిగాడు.



ఈ మాటకు గురువు, "లేదు, కాంతి కన్యను తెస్తే వస్త్రభూషణ లిచ్చి మళ్ళీ మర్యాదగా సాగనంపాలికద? కనుక మా స్వంత కన్యనే ఎప్పటికీ నమ్ముకుని వుంటాం. అదే మాకు పదివేలు," అని జవాబు చెప్పాడు.

గురు కుమారుడు దీని అర్థం ఇలా చెప్పాడు: "'అప్పుగా తరుచు ధనం తెచ్చుకుంటారా?' అని మీ ప్రశ్న. 'లేదు, స్వంత సంపాదనతోనే కాలక్షేపం చేస్తున్నా' మని మా నాన్నగారి జవాబు."

ఇంతటితో ఊరుకోలేదు, భార్గవుడు. "కల్పవృక్షాన్ని ఆశ్రయించాలి గాని,

కేవలం ఒక చీపురు పుల్లను ఆధారం చేసుకోవటం భావ్యమా?'' అని అడిగాడు.

దీనికి సూక్ష్మంగా, ''కల్పవృక్షం లేక చీపురుపుల్ల మాత్రం ఎలా వస్తుంది? చీపురుపుల్లలు కూడితేనే పరిశుభ్రత వస్తుంది. పరిశుభ్రతే లక్ష్మిప్రదం.'' అన్నాడు కర్మఠీయుడు.

ఈ సమస్యను గురించిన వివరణ ఇలా చెప్పాడు గురువుగారి కొడుకు: ''రాజాశ్రయం లేక గ్రామం ఉండదు. నేనే గ్రామాన్ని అలక్ష్యం చేస్తే బాగుచేసే దెవరు? గ్రామస్థులందరూ విద్యావంతులై, ఏకీ భావంగా వుంటే గ్రామం అభివృద్ధి పొందుతుంది. గ్రామంలో తెలివిమంతులకు రాజాశ్రయం కలగవచ్చు—అని, మీ ప్రశ్నకు నాన్నగారి జవాబు.''

ఇలా సంభాషణ జరుగుతూండగా గురువుగారి మూడేళ్ళ మనవరాలు గబగబ చెరువుకు పరుగెత్తుకు వచ్చింది. వస్తూనే తాతకు ఊపిరాడకుండా ప్రశ్నల వర్షం కురిపించసాగింది.

ఆ పాపను చూసి ఎంతో ముచ్చటపడిన భార్గవుడు, ''అమ్మాయీ, నే నొక చిన్న ప్రశ్న వేస్తా జవాబు చెప్పు మరి, చూదాం.'' అన్నాడు.

''అడగండి మరీ,'' అంది పిల్ల కళ్ళు తిప్పుతూ.

''మౌనంగా వుండాలంటే ఏం చెయ్యాలి?'' అని అడిగాడు భార్గవుడు.

తడుముకోకుండా ఒక్క గుక్కలో ''అల్లరిచెయ్యాలి,'' అనేసి, గిరుక్కుమని తిరిగి ఇంటికి పారిపోయింది పిల్ల.

అందరూ నవ్వుకున్నారు. భార్గవుడు ఆశ్చర్యపోయాడు. మనసులో మరెట్టి సంశయమూ లేకుండా ఆయన తన కొడుకును కర్మఠీయుడి గురుకులంలోనే చేర్పించాడు. కాలక్రమాన దీపకుడు గొప్ప విద్వాంసుడై, కులదీపకుడై తండ్రికి మంచి కీర్తి తెచ్చాడు.






ప్రహస్తుడు హనుమంతుణ్ణి రావణుడు కోరినట్టు అడిగితే, హనుమంతుడు ఇలా సమాధానం చెప్పాడు:

"రాక్షసరాజువైన నిన్ను చూడగోరి అశోకవనం విరిచాను. అది నాకు సులభంకాలేదు. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా మీద యుద్ధానికి వచ్చారు. నేను ఆత్మరక్షణ కోసం వారితో యుద్ధం చెయ్యవలసి వచ్చింది. నన్ను ఏ అస్త్రం గాని, పాశం కాని బంధించలేవని బ్రహ్మదేవుడి వరం ఉన్నది. నిన్ను చూడటం కోసమే బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డాను. అంతకన్న మరేమీ లేదు. నేను మహాపరాక్రమశాలి అయిన రాముడి దూతను. నీతో నాకొక రాజకార్యం ఉన్నది. నీ మేలు కోరి చెప్పే నా మాటలు శ్రద్ధగా ఆలకించు.

"సుగ్రీవుడు నీకు తన క్షేమం తెలిపి, నీ క్షేమం అడగమన్నాడు. వాలి నీకు తెలుసు. ఆ వాలిని రాముడు ఒక్క బాణంతో చంపి, సుగ్రీవుణ్ణి వానరరాజును చేశాడు. సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చి, ఆ ప్రకారం అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో నేను ఒకణ్ణి. నేను వాయుదేవుడి కొడుకును. నా పేరు హనుమంతుడు. నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి సీతను చూడటానికి ఇక్కడికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ధర్మం తెలిసిన నీ వంటివాడు



బలాత్కారంగా పరస్త్రీని పట్టి ఉంచరాదు. రామలక్ష్మణుల కోపానికి గురి అయి సుఖపడగలవాడు మూడు లోకాలలోనూ ఉండడు. ఈ మాట సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు. నేను సీతను చూశాను కనక ఇక కర్తవ్యం రాముడి మీద ఉన్నది. అది ఏమిటో నాకైతే తెలియదు. తలచుకుంటే నేనే నీ లంకను ధ్వంసం చెయ్యగలను. కాని రాముడు అందుకు ఒప్పుకోడు. సీతను అపహరించిన వాళ్ళను తానే చంపుతానని వానర, భల్లూక సేనల ముందు అతను ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. సీత నీ పాలిటి మృత్యుదేవత అన్నది గ్రహించి, నీ క్షేమం ఆలోచించుకో. నేను మనిషినీ కాను, రాక్షసుణ్ణీ కాను. అందుచేత పక్షపాతం లేకుండా ఉన్న మాట చెబుతున్నాను. నిన్ను రాముడి బారి నుంచి ఎవరూ రక్షించ లేరు.''

హనుమంతుడు ఇలా నిర్భయంగా చెప్పిన మాటలు విని రావణుడు కోపోద్రేకంతో, ''ఈ హనుమంతుణ్ణి చంపండి!'' అని కేక పెట్టాడు.

అప్పుడు బుద్ధిమంతుడైన విభీషణుడు రావణుడితో, ''రావణేశ్వరా! హనుమంతుణ్ణి చంపటం రాజధర్మానికి విరుద్ధం; లోకాచారానికి వ్యతిరేకం. కోపం విడిచిపెట్టి దూతకు తగి ఉండే శిక్ష ఏదైనా విధించు,'' అన్నాడు.

రావణుడి కోపం ఏమాత్రమూ తగ్గలేదు. అతను విభీషణుడితో, ''ఈ వానరుడు పాపి. పాపులను చంపటంలో పాపం ఏమీ లేదు,'' అన్నాడు.

దానికి విభీషణుడు, ''ఎలాంటి పరిస్థితిలోనూ దూతను చంపరాదని పెద్దలు చెబుతారు. అయినా, దూతకు తగిన శిక్షలు అనేకం చెప్పబడి ఉన్నాయి. అంగవైకల్యం కలిగించవచ్చు; కొరడాతో కొట్టవచ్చు; తల గొరగవచ్చు; కాల్చి ముద్ర వేయవచ్చు. కాని దూతను చంపటమన్నది ఏ శాస్త్రంలోనూ కనబడదు. నీవంటి ధైర్యశాలి కోపానికి వశుడు కారాదు.

అది అలా ఉంచి, ఇతన్ని చంపటం వల్ల మనకు లాభం ఏమీ ఉండదు. నువ్వు చంపవలసినది ఇతన్ని ఇక్కడికి పంపిన వాళ్ళను. ఇతను చెప్పిన మాటలు ఇతనివి కావు. సముద్రాన్ని దాటగల వాడు ఇతను తప్ప మరొకడు ఉన్నాడని నాకు తోచదు. అందుచేత, ఇతన్ని చంపితే, రామలక్ష్మణులను ఇక్కడికి రప్పించి, నీతో యుద్ధం చేయటానికి తోడ్పడేవాడు మరొకడు ఉండడు. వాళ్ళను పట్టుకున్నట్టయితే నీ కీర్తి హెచ్చుతుంది," అన్నాడు.

రావణుడు విభీషణుడు చెప్పిన దానికి తృప్తిపడి, అతను చెప్పినట్టు చేయ నిశ్చయించాడు. అతను ఇలా అన్నాడు:

"నువ్వు చెప్పినది నిజం. దూతను చంపటం తప్పే. అందుచేత ఇతనికి మరొక శిక్ష ఇద్దాం! కోతులకు ప్రియమైనది తోక. ఇతన్ని తోక కాల్చి వదిలెయ్యండి."

హనుమంతుడి తోకకు నిప్పు అంటించి, అతన్ని నగరమంతటా తిప్పి, కూడలి స్థలాలలో ప్రదర్శించమని ఉత్తరువు అయింది.

రాక్షసులు గుడ్డ పేలికలు తెచ్చి హనుమంతుడి తోకకు చుట్టారు; తరవాత తోక మీద నూనె పోసి నిప్పు అంటించారు.

వాళ్ళు ఈ తతంగం చేస్తున్నంతసేపూ హనుమంతుడి కోపం కార్చిచ్చులాగా పెరిగిపోతూ వచ్చింది. చివరకు అతను





మండుతున్న తన తోకతో వాళ్ళను చావబాదాడు.

ఈ లోపుగా హనుమంతుడి తోకను తగలబెట్టుతున్నారన్న వార్త విని లంకలో ఉన్న పిల్లలూ, స్త్రీలూ, ముసలివాళ్ళూ పరమానందంతో చూడటానికి వచ్చారు. అందరు రాక్షసులూ చేరి హనుమంతుణ్ణి మళ్ళీ పట్టుకుని కట్టేసి, తీసుకుపోయారు. తన తోక కాలుతుందన్న భయం లేనందువల్ల హనుమంతుడు వాళ్ళవెంట వెళ్ళాడు. అప్పుడు తను చిన్నరూపంలోనే ఉన్నాడు.

రాక్షసులు శంఖాలు ఊదుతూ, భేరీలు మోగిస్తూ, హనుమంతుణ్ణి లంక అంతా తిప్పారు. ఇలా తిరుగుతూ హనుమంతుడు లంకలో ఆయుధాలు ఉండే ప్రదేశాలూ, ఇతర రహస్య స్థావరాలూ చక్కగా చూశాడు. వెళ్ళిన చోటనల్లా రాక్షసులు హనుమంతుణ్ణి, "వేగులవాడు" అని చాటారు.

రాక్షసస్త్రీల ద్వారా సీత, హనుమంతుడి తోకకు నిప్పుపెట్టిన వార్త విని, ఎంతో దుఃఖించి, అగ్నిహోత్రుణ్ణి తలుచుకుని, హనుమంతుడికి అపాయం కలగకుండా చూడమని ప్రార్థించింది.

సీత పడే బాధ చూసి సరమ, "అమ్మా, ఆ కోతిని గురించి నువ్వు దిగులుపడకు. అతను మహానుభావుడు. అతను తన వెంట ఉన్న రాక్షసులనందరినీ చావగొట్టి, ఒక ఇంటి మీది నుండి మరొక ఇంటి మీదికి దూకుతూ లంకనంతా తగలబెట్టుతున్నాడు. అదుగో చూడు!" అన్నది.

సరమ చెప్పినది అక్షరాలా నిజం. హనుమంతుడు రాక్షసులను శిక్షించ నిశ్చయించుకుని, తన దేహాన్ని అతి చిన్నది చేసి, కట్ల నుంచి బయటపడ్డాడు. అతను తిరిగి దేహాన్ని పెంచి, నగర ద్వారం వద్ద ఉన్న ఇనుప పరిఘ తీసుకుని తన వెంట ఉన్న రాక్షసులందరినీ చంపాడు. అప్పుడతనికి లంకను తగలబెట్టాలన్న ఆలోచన వచ్చింది. అతను కాలుతున్న తోకతో ఇళ్ళ మీదుగా తిరగనారంభించాడు.



అతను ముందు ప్రహస్తుడి ఇల్లు కాల్చి, మహాపార్శ్వుడి ఇంటికి వెళ్ళాడు. అందులో చిచ్చుపెట్టి, వరసగా శుకుడూ, వజ్రదంష్ట్రుడూ, సారణుడూ, ఇంద్రజిత్తూ, జంబుమాలీ, సుమాలీ మొదలైన రాక్షస ప్రముఖుల ఇళ్ళన్నీ తగలబెట్టాడు. అతను ఒక్క విభీషణుడి ఇంటిని వదిలిపెట్టాడు. రాక్షసుల ఇళ్ళే కాక, వాళ్ళు ఎంతో కాలంగా చేర్చిపెట్టుకున్న సంపదలన్నీ బూడిద అయిపోయాయి. చివరకు అతను రావణుడి ఇల్లు కూడా కాల్చాడు.

అంతవరకూ రావణుడికి భయపడుతూ వచ్చిన అగ్నీ, వాయువూ ఇప్పుడు విజృంభించినట్టు కనపడ్డారు. ఇళ్ళలోని వెండి బంగారాలు కరిగిపోయాయి. మహా భవనాలు మట్టిలో కూలిపోయాయి. ఈ దహనకాండను ఎలా ఆపాలో రాక్షసులకు తెలియలేదు. అగ్నిహోత్రుడే కోతి రూపంలో వచ్చి ఉంటాడని వాళ్ళకు అనుమానం కలిగింది. చాలామంది రాక్షసులు మంటలకు ఆహుతి అయ్యారు. ఎంతో అందమైన లంకానగరం బీభత్స రూపం ధరించింది. రాక్షసుల ఆర్త నాదాలు మిన్నుముట్టాయి.

హనుమంతుడి ఆగ్రహం తీరింది. అతను తృప్తిపడ్డాడు. అతను వచ్చిన పని జయప్రదమయింది. అశోకవనం ధ్వంసమయింది. అనేకమంది రాక్షసులు చచ్చారు. లంక బూడిద అయింది. అతను వెళ్ళి, తన తోకను సముద్రంలో ముంచి చల్లార్చాడు.

అప్పుడు అతనికి తాను చాలా చెడ్డపని చేశానని పశ్చాత్తాపం కలిగింది. లంక అంతా తగలబడినాక సీత క్షేమంగా ఉంటుందా అని అతనికి భయం కలిగింది. ఆవేశం కొద్దీ లంకను తగల బెట్టుతూ తాను సీతను రక్షించాలన్న మాట మరిచాడు. నిజంగా సీతకు ఆపద జరిగి ఉంటే అతను అక్కడే చచ్చిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అయితే, అతనికి ఇంకో ఆలోచన వచ్చింది. తన తోకనే



కాల్చని అగ్నిహోత్రుడు సీతాదేవిని ఎందుకు కాల్చుతాడు? అతను శింశుపా వృక్షం వద్దకుపోయి, దానికింద ఉన్న సీతను చూసి, నమస్కరించి, "అమ్మా, నా అదృష్టం బాగుండి నువ్వు క్షేమంగా ఉన్నావు గద!" అన్నాడు.

సీత అతనితో, "హనుమంతుడా, నీ బలం ఎలాటిదని చెప్పాలి! నువ్వు ఒక్కడివే ఈ రాక్షసులందరినీ చంపి, నన్ను రాముడి దగ్గరికి తీసుకుపోగలవు. కాని రాముడే వచ్చి, శత్రువులను చంపి నన్ను తీసుకుపోవటం ఉచితంగా ఉంటుంది. అందుచేత, నువ్వే రాముణ్ణి అలా చేయమని ప్రేరేపించు," అన్నది.

"నీకు సందేహం అవసరం లేదు. రాముడు తప్పక వచ్చి నీ దుఃఖం తీర్చుతాడు," అని సీతకు చెప్పి, ఆమె వద్ద సెలవు పుచ్చుకుని, అరిష్టం అనే పర్వతం ఎక్కి, తిరిగి సముద్రాన్ని దాటటానికి సిద్ధపడి, తన దేహాన్ని పెంచాడు. అతను కాళ్ళతో పర్వతాన్ని తన్ని గాలిలోకి లేచే సరికి, అరిష్టపర్వతం అదిరింది.

అతను మబ్బుల మధ్యగా ఎగురుతూ సముద్రాన్ని దాటి, దూరాన మహేంద్ర పర్వతాన్ని చూస్తూనే గట్టిగా సింహనాదం చేశాడు. హనుమంతుడి కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్న అంగదుడు మొదలైన వానరులు ఆ సింహనాదం విన్నారు. వారికి ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది.

అప్పుడు జాంబవంతుడు మిగిలిన వానరులతో, "హనుమంతుడు వెళ్ళిన పని జయప్రదం అయింది. లేకపోతే అతను ఇంత గట్టిగా సింహనాదం చెయ్యడు," అన్నాడు. ఈ మాటకు వానరులు పరమానందం చెంది, హనుమంతుణ్ణి చూడటానికి చెట్లూ, గట్లూ ఎక్కారు; అతను దూరంగా కనపడగానే చెట్లకొమ్మలు ఆడించారు.

త్వరలోనే హనుమంతుడు మహేంద్ర పర్వతం మీద దిగాడు. వానరులందరూ

అతని చుట్టూ మూగారు. వాళ్ళు అతనికి కందమూలఫలాలు తెచ్చి ఇచ్చారు. హనుమంతుడు జాంబవంతుడికీ, అంగదుడికీ, ఇతర పెద్దలకూ నమస్కారాలు చేశాడు. అతను నోరు తెరుస్తూనే, "చూశాను సీతను!" అని రెండు ముక్కల్లో ముఖ్య విషయం చెప్పాడు. ఆ మాటకు వానరులు అమితంగా సంతోషించారు. కొందరు సింహనాదాలు చేశారు. కొందరు గట్టిగా అరిచారు. కొందరు గర్జించారు. కొందరు మామూలు కోతుల్లాగా కిచకిచలాడారు. కొందరు తమ తోకలను బలంగా నేలకేసి కొట్టారు.

హనుమంతుడు వానరులతో, "సీతను చూశాను," అనేసి ఇంకేమీ చెప్పకుండా ఉండిపోయాడు.

అప్పుడు అంగదుడు హనుమంతుడితో, "హనుమంతుడా, నూరు యోజనాల సముద్రాన్ని ఇటు నుంచి అటూ, అటు నుంచి ఇటూ దాటిన నీ బలపరాక్రమాలు మరొకరికి సాధ్యం కావు. నీకుగల రాజభక్తి కూడా అసాధారణ మైనది. మా అందరి అదృష్టం కొద్దీ నువ్వు రాముడి భార్య అయిన సీతాదేవిని చూశావు. ఇంక రాముడికి సీతా విరహం ఉండదు," అన్నాడు.

మధ్య హనుమంతుడూ, అంగదుడూ, జాంబవంతుడూ మహేంద్ర పర్వతం మీద కూర్చుంటే మిగిలిన వానరులందరూ చుట్టూ ఉన్న శిలల మీద కూర్చున్నారు. లంకలో జరిగినదంతా హనుమంతుడి నోట వినాలని వారికి కుతూహలంగా ఉన్నది.

జాంబవంతుడు హనుమంతుడితో, "నాయనా, నువ్వు సీతాదేవిని ఎలా చూశావు? ఆవిడ ఎలా ఉన్నది? రావణుడు ఆమెను ఎలా చూస్తున్నాడు? అంతా విన్న తరవాత మనం కర్తవ్యం ఆలోచించుదాం. ఉన్నదంతా నువ్వు దాచకుండా చెబితే, రాముడితో మనం ఏ సంగతి చెప్పవచ్చునో, ఏది దాచాలో చూసుకోవచ్చు," అన్నాడు.





# ఉపకారికి అపకారం

ఒకానొకప్పుడు కూనవరం అనే గ్రామంలో సీనయ్య అనే వాడుండేవాడు. వాడికి సొంత ఇల్లు లేదు; కుంటపొలం కూడా లేదు. ఎవరిదో నాలుగెకరాల పొలం కౌలు చేసుకుని రోజులు గడుపుతున్నాడు. సీనయ్యకూ, వాడి భార్య సీనమ్మకూ అప్పుచేసి పప్పుకూడు తినే అలవాటు ఉన్నది. అందువల్ల సీనయ్యకు గ్రామంనిండా అప్పులే!

ఒక రోజున సీనమ్మ భర్తతో, "రెక్కాడితేకానీ డొక్కాడకుండా, ఈ ఊళ్ళో ఎన్నాళ్ళుంటాం? ఈ ఊరు మనకు అచ్చిరాలేదు. నగరంలో మా అన్నయ్య వున్నాడు. ఒక వంద వరహాలు తీసుకుని వాడి వద్దకు వెళితే, ఆ డబ్బు అధికారులకు లంచంగా ఇచ్చి, నీకేదైనా జీవనోపాధి చూపిస్తాడు. అప్పుడు ఏ బాధా లేకుండా నెలనెలా వచ్చే జీతంతో హాయిగా బతకొచ్చు," అని చెప్పింది.

ఈ ఉపాయం సీనయ్యకు నచ్చింది. అయితే, నగరానికి తీసుకుపోవడానికి, ఇంట్లో చిల్లిగవ్వ లేదు. ఎవరినైనా అడుగుదామంటే, ఊరునిండా అప్పులు. అయినా, వాడు నలుగురికీ నాలుగు మాయమాటలు చెప్పి, నూరు వరహాలు అప్పుగా తీసుకుని, అడవిమార్గాన నగరానికి బయల్దేరాడు. కానీ వాడి దురదృష్టం కొద్దీ అడవిమధ్యలో వాణ్ణి దొంగలు పట్టుకుని, దగ్గరున్న నూరు వరహాలూ లాక్కుని బందీగా తీసుకుపోయారు. దొంగల నాయకుడు వాడికి రోజూ తనకు మాలీసు చేసేపని అప్పగించాడు. ఆ ప్రకారం సీనయ్య రోజూ దొంగల నాయకుడితోపాటే తిరుగుతూ, నాయకుడు విశ్రాంతి తీసుకునే సమయంలో వళ్ళు పడుతూండేవాడు.

అలా నాలుగు మాసాలు గడిచాయి. ఒక రోజున విలువైన దుస్తులు ధరించిన

"వసుంధర"



పెద్దమనిషి ఒకడు గుర్రం మీద వెళుతూండగా, దొంగలు ఆయనను అటకాయించారు. పెగమనిషి కత్తిదూసి వీరోచితంగా వాళ్ళతో పోరాడాడు. కానీ ఒక్కడూ పదిమందితో ఎంతసేపు పోరాడగలడు? బాగా గాయపడి గుర్రం మీద వాలిపోయిన ఆయనను, దొంగలు తమ నాయకుడి వద్దకు తీసుకు వెళ్ళారు.

నాయకుడు పెద్దమనిషి ముఖం చూస్తూనే, తన అనుచరుల మీద పట్టరాని కోపంతో మండిపడి, అయనకు శీతలోపచారాలు చేసి స్పృహ తెప్పించి, అయన కాళ్ళ మీద పడి తన తప్పు క్షమించమన్నాడు.

ఆ పెద్దమనిషి పేరు జయగుప్తుడు. మంచితనంలో అయనకు సాటిలేరని చెప్పుకుంటారు. ఒకసారి రాజభటులు తరుముతూండగా, దొంగల నాయకుడు పారిపోయి జయగుప్తుడి ఇంట చేరాడు. బాగా గాయపడిన దొంగల నాయకుణ్ణి జయగుప్తుడు దాచి, రహస్యంగా వైద్యం చేయించాడు. నాయకుడు వెళ్ళేటప్పుడు జీవితంలో మళ్ళీ దొంగతనం చేయనని, జయగుప్తుడికి మాట ఇచ్చాడు.

''నా ప్రాణదాతను నా అనుచరులే గాయపరిచారు. ఉపకారికి అపకారం చేశాను. మిమ్మల్ని క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు,'' అంటూ బాధపడ్డాడు దొంగల నాయకుడు.

ఇందుకు జయగుప్తుడు నవ్వి, ''నీకు కావలసింది నేను క్షమించడమే అయితే, అడక్కుండానే నేను నిన్ను క్షమించేశాను. కానీ, నువ్వు మాట ఇచ్చి తప్పడం, నాకెంతో బాధగా వున్నది. దోపిడి దొంగలు తెలిసో తెలియకో, ఉపకారికి కూడా అపకారం చేయగలరని నీకు తెలిసింది కదా? కాబట్టి ఈ క్షణం నుంచీ దొంగతనాలు మానివేసి గౌరవంగా జీవించు. లేకుంటే ఒక దుర్మార్గుడికి ప్రాణదానం చేసి లోకానికి అపకారం చేశానని నేను బాధపడతాను,'' అన్నాడు.

"అయ్యా, ఒకసారి చేసిన తప్పు మళ్ళీ చేయను. ఇన్నాళ్ళూ నేను చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తంగా, ఈ అడవిలో ప్రయాణం చేసే యాత్రికులకు, ఇతర దొంగల బాధ లేకుండా రక్షిస్తూంటాను. ఈ అడవిలోనే వ్యవసాయం చేసుకుని జీవిస్తాను," అన్నాడు దొంగల నాయకుడు.



జయగుప్తుడు, దొంగల నాయకుడిలో, వచ్చిన మార్పుకు ఎంతగానో సంతోషించాడు. అయితే, నాయకుడి పక్కనే వున్న సీనయ్యకు, కలకాలం తాను నాయకుడి సేవకుడిగా మిగిలిపోతానని భయం వేసింది. వాడు ముందుకు వచ్చి జయగుప్తుడికి తనగోడు చెప్పుకున్నాడు.

జయగుప్తుడు, దొంగల నాయకుడితో, "వీడు నీకు చేసిన సేవలకుగాను, నాలుగు మాసాలకూ నాలుగువేల వరహాలిచ్చి ఇక్కణ్ణించి పంపించు," అన్నాడు.

దొంగల నాయకుడు అందుకు సరేనన్నాడు.

అప్పుడు జయగుప్తుడు, సీనయ్యతో, "నిజానికి నేనిప్పుడు కూనవరం బయల్దేరాను. నా ఆరోగ్యానికి పల్లెటూరిగాలి మంచిదని వైద్యుడు చెప్పాడు. కూనవరంలో చెంగయ్య అనేవాడు ఇల్లు, పొలం అమ్ముతున్నాడని తెలిసి పదిహేను వేల వరహాలు తీసుకుని ప్రయాణమైతే ఇలా జరిగింది. వెంటనే డబ్బందకపోతే చెంగయ్య ఇల్లూ, పొలం వేరెవరికైనా అమ్మేయగలడు. నేనేమో ఈ గాయాలతో కూనవరం రాలేను. నగరానికి వెళ్ళి అక్కడ కొన్నాళ్ళున్నాక కూనవరం వస్తాను. ఈలోగా ఈ డబ్బు తీసుకుని వెళ్ళి, నాకు పొలం, ఇల్లూ కొనిపెట్టు," అన్నాడు.

దొంగల నాయకుడు ఆశ్చర్యంగా, "అయ్యా, మీరు ముక్కు, మొహం తెలియని మనిషిని నమ్మి పదిహేనువేల వరహాలిస్తున్నారు. వాడు మిమ్మల్ని మోసగిస్తే?" అన్నాడు.

ఆ మాటలకు జయగుప్తుడు నవ్వి, "నేను మనిషిలోని మంచితనాన్ని నమ్మిన



వాణ్ణి. సీనయ్య నన్ను మోసగిస్తే, నాకు కలిగే నష్టం పదిహేను వేల వరహాలు మాత్రం. అది నా సంపదలో లక్షోవంతు కూడా చేయదు కాబట్టి, నేనా నష్టాన్ని సులభంగా భరించగలను. ఉపకారికి అపకారం చేసి, అందువల్ల పొందిన లాభాన్ని సీనయ్య భరించగలడో లేడో వాడికే తెలియాలి. పెద్దగా నష్టం లేనంత కాలం మంచితనాన్ని నమ్మడం, నా పద్ధతి," అన్నాడు.

ఆ తర్వాత జయగుప్తుడు నగరం వెళ్ళాడు. సీనయ్య కూనవరం చేరుకున్నాడు. జరిగింది భర్త నోట విన్నాక సీనమ్మ, "ఆ జయగుప్తుడు వెర్రి బాగుల వాడిలా వున్నాడు. ఆ చెంగయ్య ఇల్లూ, పొలం మా అన్నయ్య పేరు చెప్పి మనమే కొనేసుకుందాం," అన్నది.

ఈ ఉపాయం సీనయ్యకూ నచ్చింది. వాడు ఊళ్ళో రెండువేల వరహాలతో తన అప్పులన్నీ తీర్చేసి, చెంగయ్య అమ్మిన ఇల్లూ, పొలం తనే కొనేసుకుని, నలుగురికీ మాత్రం, "ఈ ఇల్లూ, పొలం తన కోసం కొనిపెట్టమని మా బావ చెప్పాడు," అని అబద్ధాలాడాడు.

ఆ తర్వాత నెల రోజులకు జయగుప్తుడి మనిషి, నగరం నుంచి సీనయ్య కోసం ఒక ఉత్తరం తెచ్చాడు. తను కూనవరం రావడాని కింకా మాసం గడువున్నదనీ, ఇల్లూ, పొలం కొన్న కబురు తెలియచేయమనీ—ఆయన ఉత్తరంలో రాశాడు.

సీనయ్య ఆయనకీవిధంగా బదులు పంపాడు: "అయ్యా, మీరు లోగడ పంపిన మనిషొకడు, మీకు కూనవరంలో ఇల్లూ, పొలం వద్దనీ, డబ్బు తన ద్వారా పంపమనీ చెప్పాడు. ఆ ప్రకారం ఆ ఇల్లూ, పొలం నేను వద్దంటే, మా బావ కొనుక్కున్నాడు. డబ్బును నా దగ్గిరే వుంచాను. అయితే మీరు పంపిన మనిషి కారణంగా, అందరికీ నాదగ్గిర డబ్బున్నట్టు తెలిసిపోయి, అదంతా అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. మీకది నెమ్మదిగా తీర్చుకుంటాను."

వారం రోజుల్లో సీనయ్యకు, జయగుప్తుడి నుంచి మరొక ఉత్తరం అందింది. అందులో, "నువ్వు నన్ను మోసగించావు. నీవంటి మోసగాడున్న గ్రామంలో అడుగు పెట్టడం ఇష్టం లేక, నేను మరొక గ్రామం వెళుతున్నాను," అని వున్నది.

ఆ ఉత్తరం చూసి సీనయ్య బాధ పడ్డాడు. అయితే వాడి భార్య సీనమ్మ, "ఎందుకా బాధ? నువ్వు ఆయనను మోసం చెయ్యలేదు. ఆయన డబ్బు నీవద్ద పదిహేను వేల వరహాలుంది. మోసగాడైతే, ఆ డబ్బసలు నాకివ్వలేదంటాడు. నువ్వు దాన్ని బాకీ కింద తీరుస్తానన్నావు. నీమంచితనాన్ని అర్థం చేసుకోని, ఆ జయగుప్తుడు మంచివాడు కాదు. అలాంటి వాడి ఉత్తరం చూసి బాధపడకు," అని చెప్పింది.

సీనయ్యకు భార్య మాటలు తృప్తి కలిగించాయి. ఆ విధంగా రెండు సంవత్సరాలు గడిచిపోయినై. ఆస్తి వున్నా వాడికి ఎందులోనూ కలిసిరావడం లేదు. వానలు లేక పంటలు పండలేదు. తుఫాను వచ్చి ఇల్లు కూలింది. అది బాగు చేయించేందుకు చాలా డబ్బు ఖర్చయింది. ఎప్పటిలాగా వాడు అప్పుల్లోనే వుండిపోయాడు.

ఇలా వుండగా, సమీపారణ్యంలో ఒక యోగి నూరువరహాలు తీసుకుని, ఎలాంటి సమస్యకైనా పరిష్కారం చెబుతున్నట్లు



సీనయ్యకు తెలిసింది. తన సమస్యకు వేరేవాళ్ళెవరూ దారి చూపలేరని, వాడు నూరువరహాలు తీసుకుని యోగిని చూడబోయాడు.

అయితే, దారిలో దొంగ ఒకడు వాణ్ణి అటకాయించి, దగ్గిరున్న డబ్బంతా బయట పెట్టమన్నాడు. ఏం చేయడమా అని సీనయ్య ఆలోచిస్తూండగా, ఎక్కడి నుంచో ఇద్దరు మనుషులు మెరుపుల్లా వచ్చి, ఆ దొంగను పట్టుకుని, "దొంగతనాలు మానమని ఎన్నిసార్లు చెప్పినా, నీకు బుద్ధి రావడం లేదు. ఇక నిన్ను క్షమించం. మా నాయకుడు నీకు తగిన శిక్ష నిర్ణయిస్తాడు," అంటూ వాణ్ణి లాక్కుపోయారు.



తన తప్పొప్పుకుని క్షమించమని వేడు కున్నాడు.

జయగుప్తుడు చిన్నగా నవ్వి, "పేదరికం ఎన్నో అనర్థాలకు దారి తీస్తుంది. నువ్వు మోసం చేశావన్న కోపంతో, నీకు ఉత్తరం పంపగానే నాకు నీమీద వున్న కోపమంతా పోయింది. అడక్కపోయినా నిన్ను అప్పుడే క్షమించేశాను, వెళ్ళు!" అన్నాడు.

సీనయ్య, జయగుప్తుడి మంచితనానికి కృతజ్ఞత చెప్పుకుని, తిరిగి తన గ్రామం కేసి బయల్దేరాడు. అరణ్యంలో అడుగు పెట్టగానే వాడికి, మళ్ళీ ఇంకో అనుమానం కలిగింది. జయగుప్తుడు నిజంగా తనను ఏనాడో క్షమించివుంటే, తన సమస్య లెందుకు తీరిపోలేదు ?

సీనయ్య మరొకసారి యోగివద్దకు వెళ్ళి, "స్వామీ! తమరు చెప్పింది నిజం కాదు. నేను అడక్కుండానే జయగుప్తుడు నన్నెప్పుడో క్షమించేశానన్నాడు. అయినా, నా సమస్యలన్నీ అలాగే వున్నాయి. అంటే—అందుకు కారణం వేరే ఏదో వున్నదనేగదా ?" అని అడిగాడు.

దానికి యోగి, "మంచివాడి క్షమ చెడ్డవాళ్ళ పాపాలను కడుగుతుందనుకుంటే, అది చెడ్డవాడి తెలివితక్కువ తనం. ఈ ప్రపంచంలో చెడ్డవాళ్ళ సంఖ్య ఎక్కువ; మంచివాళ్ళ సంఖ్య తక్కువ.

వాళ్ళు గతంలో దొంగలనాయకుడి అనుచరులనీ, జయగుప్తుడి కిచ్చిన మాట మీద నిలబడి, వాళ్ళు అరణ్యంలో యాత్రీకులకు దొంగల భయం లేకుండా చేస్తున్నారనీ అర్థమై, సీనయ్య ఎంతో సంతోషించాడు.

తర్వాత వాడు యోగి దగ్గిరకు పోతే, ఆయన వాడి వంక తీక్షణంగా చూసి, "నువ్వు ఉపకారికి అపకారం చేసిన మహాపాపివి! వెళ్ళి ఆ ఉపకారిని క్షమాభిక్ష వేడుకునేదాకా, నీకు మోక్షం లేదు." అని చెప్పాడు.

చేసేదిలేక సీనయ్య అక్కణ్ణించి నగరం వెళ్ళి, జయగుప్తుణ్ణి కలుసుకుని,

చెడ్డవాడి పాపం మంచివాడి క్షమతో పోతుందని తెలిస్తే, చెడ్డవాడు మంచివాడి మంచితనాన్ని దుర్వినియోగం చేస్తాడు. ఎందుకంటే, ఎలాంటి తప్పునైనా క్షమించడానికి మంచివాడు సిద్ధంగా వుంటాడు! పశ్చాత్తాపం చెంది పరివర్తన తెచ్చుకోని చెడ్డ మనిషిని, మరొక మంచి మనిషి క్షమించవచ్చును కానీ, దేవుడు క్షమించడు. నువ్వు జయగుప్తుడి డబ్బు అపహరించావు. ఆయన కొందామనుకున్న ఇల్లూ, పొలం ఆయన క్కకుండా చేశావు. అందుకు నీలో నిజంగానే పశ్చాత్తాపం కలిగితే ఆ ఇల్లూ, పొలం మనస్ఫూర్తిగా ఆయనకిచ్చేసి, కాళ్ళమీద పడి క్షమించమని అడగాలి. నువ్వు నీ సమస్యలు తీరిపోతాయన్న ఆశతో ఆయన వద్దకు వెళ్ళావు తప్ప, నీలో రవ్వంత కూడా పశ్చాత్తాపం లేదు. తన తప్పుకు పశ్చాత్తాప పడి, ఒక దారిదోపిడి దొంగ ఇప్పుడు అడవిలో యాత్రీకులను దొంగల బారినుంచి రక్షిస్తూంటే, ఆ దొంగకున్న పాటి నీతి నియమాలు లేని నీవంటివాణ్ణి, జయగుప్తుడు క్షమించినా, భగవంతుడెలా క్షమిస్తాడనుకున్నావు?'' అని అడిగాడు.

అప్పటికి సీనయ్యకు తన తప్పు అర్థమయింది. వాడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ జయగుప్తుడి దగ్గరకు వెళితే, వాణ్ణి ఆయన ఓదార్చి, ''వెర్రివాడా! నువ్వు నానుంచి అపహరించిన ధనం, నా సంపదలో లక్షోవంతు కూడా చెయ్యదు. ఈ సంగతి లోగడ దొంగల నాయకుడి దగ్గిర చెప్పాను. అంతేకాక, నీవంటి వాడున్న గ్రామంలో అడుగుపెట్టడం కూడా ఇష్టంలేదన్నాను. ఈ రోజునుంచీ స్వార్థం విడిచి మంచిగా బతుకు. ఆ ఇల్లూ, పొలం నువ్వే వుంచుకో,'' అని చెప్పాడు.

సీనయ్య ఇంటికి తిరిగివెళ్ళి, దుబారా ఖర్చులు తగ్గించి శ్రద్ధగా వ్యవసాయం చేసి, జయగుప్తుడి డబ్బుకు వడ్డీతో సహా బాకీ తీర్చి, మంచి పనులు చేస్తూ మంచివాడనిపించుకుని, కలకాలం సుఖంగా జీవించాడు.





# చెప్పుడు మాటలు

మణిపురాన్ని చంద్రవర్మ అనే రాజు పాలించేవాడు. ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకోవడంలో, ఆయనకు ఆయనే సాటి. ఎంతటి ధర్మప్రభువో, అంతటి వీరుడు కూడా. అయితే, చంద్రుడికి మచ్చలా చంద్రవర్మలో ఒక లోపం వుండేది. ఆయన చెప్పుడుమాటల్ని గుడ్డిగా నమ్మేసేవాడు. పొగడ్తలకు ఇట్టే లొంగిపోయేవాడు.

ఈ బలహీనతని ఆసరాగా చేసుకుని, కొందరు ఆయనచుట్టూ చేరి, తమకు గిట్టని వారి మీద ఏవేవో పితూరీలు కల్పించి చెప్పసాగారు. రాజు వాటిని గుడ్డిగా నమ్మి ఏమాత్రం ముందువెనుకలు ఆలోచించకుండా, వాళ్ళను కఠినంగా శిక్షించేవాడు. అలా చెప్పుడుమాటలకు ఎందరో అమాయకులు బలయ్యారు. దానితో ప్రజల్లో చంద్రవర్మపై గల గౌరవం తగ్గి, క్రమంగా అసంతృప్తి చోటుచేసుకోసాగింది.

ఒక రోజు, ఆస్థాన జ్యోతిష్కుడైన శ్రీనందుడు రాజభవనం పక్కగా వెళ్తూండగా, భుజం మీద పెద్ద పనసపండు నొకదాన్ని పెట్టుకుని ఎదురుగా వస్తున్న ఒక మనిషి కనిపించాడు.

శ్రీనందుడు, అతణ్ణి ఆపి, "ఏమయ్యా, చాలా పెద్ద పనసపండులా వుందే! బాగా పండినట్టుగా కూడా వుంది. ఎవరికోసం తీసుకుపోతున్నావేమిటి?" అని ప్రశ్నించాడు.

శ్రీనందుడెవరో, ఆ మనిషి ఎరగడు. అతడు శ్రీనందుడితో, "బాబూ, ఇది నా తోటలో కాసిన తొలి పండు! రాజు దేవుడితో సమానమంటారు గదా. తొలి పండును ఆయనకే సమర్పించుకుందామని వెళ్తున్నాను," అన్నాడు.

లక్ష్మీమనోజ్ఞ

"అలాగా, మంచిది! అయితే, ఇంతకూ నిన్నెందుకు ఆపానో చెప్పనే లేదు. ఎదురుగా వస్తున్న నీ ముఖంలోకి పరీక్షగా చూశాను. ఈ దేశానికి రాజు కాదగిన లక్షణాలన్నీ నీలో పుష్కలంగా వున్నట్టు గమనించాను. ఏదో ఒకనాడు నువ్వీ దేశానికి రాజువు కాగలవని, నా నమ్మకం. ఆ విషయం చెప్పాలనే, నిన్ను ఆపాను. మరి వస్తా!" అంటూ శ్రీనందుడు ముందుకు నడిచాడు.

ఈ మాటలు, రాజభవనంపై చల్లగాలి కోసం పచార్లు చేస్తున్న రాజు చంద్రవర్మ చెవిలో పడ్డాయి. శ్రీనందుడు చెప్పింది విని, ఆయనకెంతో ఆశ్చర్యం కలిగింది. అదీ ఒక గొప్ప జ్యోతిష్కుడే, ఈ మాట చెప్పాడంటే, అందులో నిజం లేకపోదని పించి, ఆయన ఏం జరుగుతుందో చూడాలన్న ఉత్సాహంతో చాటుగా వుండి గమనించ సాగాడు.

శ్రీనందుడి మాటలు వినగానే, సహజంగానే రైతు కళ్ళు మెరిశాయి. అతను వెళ్ళిపోతున్న శ్రీనందుడి వెంటపడి ఆపి, "అయ్యా, నన్ను గురించి ఇలా ఎందుకనుకున్నారో, కాస్త వివరంగా చెప్పండి," అని కోరాడు.

"చెప్పడానికి అభ్యంతరం ఏమీ లేదు. కాని, ఉచితంగా నేనెందుకు చెప్పాలి?" అని అడిగాడు శ్రీనందుడు.

తనలో రాజు కాదగినంత గొప్ప లక్షణమేమిటో, తెలుసుకోవాలన్న ఆత్రుతలో



రైతు, తను రాజదర్శనానికి బయలుదేరిన విషయం పూర్తిగా మరిచిపోయి, తన దగ్గిరున్న పనసపండును శ్రీనందుడి చేతిలో పెడుతూ, "అయ్యా, నేను చాలా పేదవాణ్ణి. ఈ పండు తప్ప ప్రస్తుతం, నాదగ్గిర చిల్లి గవ్వ కూడా లేదు. ఈ చిన్న కానుకను స్వీకరించి, ఇకనైనా చెప్పండి! నాలో తమకు కనిపించిన అంత గొప్ప రాజలక్షణాలేమిటి? తమరు చెబితే వినాలని తహతహలాడిపోతున్నాను," అన్నాడు ప్రాధేయపడుతూ.

ఇందుకు శ్రీనందుడు చిన్నగా నవ్వి, "నేనెవరో నీకు తెలుసా?" అని అడిగాడు.

"ఊహుఁ, తెలియదు. తమర్ని ఏనాడూ చూసిన గుర్తు కూడా లేదు," అన్నాడు రైతు.

"అదీ సంగతి! ఇప్పటివరకూ నేనెవర్నో కూడా, నీకు తెలియదు. అయినా, దారేపోయే నేను, నిన్ను చూసి ఏదో కల్పించి నాలుగు పొగడ్తమాటలనేసరికి గుడ్డిగా నమ్మేశావు. ఒక పేదరైతును! నేను రాజు కావడమేమిటి? ఇది సాధ్యమయ్యే పనా? అని ఆలోచించకుండా, ఎంతో గౌరవభావంతో రాజుగారి కోసం తీసుకుపోతున్న కానుకను, నాకిచ్చేశావు. దీన్నిబట్టి నువ్వెంత అమాయకుడివో, వెర్రివాడివో తెలిసిపోతున్నది. ఎవరేది చెప్పినా వెంటనే నమ్మేసే, నీలాంటి గొప్ప అమాయకుడు, ఈ రాజ్యంలో ఇంకొకడు వుండే అవకాశం లేదు. ఈ దేశానికి రాజు కావడానికి, అంతకంటే ప్రధాన లక్షణం మరేం కావాలి? ప్రయత్నించి చూడు, రాజువు కాగలవు!" అంటూ శ్రీనందుడు ముందుకు సాగాడు.

ఇదంతా విన్న రాజు చంద్రవర్మ కళ్ళు తెరుచుకున్నాయి. తనకు తగిన పాఠం చెప్పడానికే, శ్రీనందుడిలా ప్రవర్తించాడని ఆయన గ్రహించాడు.

ఆ తర్వాత శ్రీనందుడాశించిన విధంగానే, చంద్రవర్మ ప్రవర్తనలో పూర్తిగా మార్పు వచ్చింది.





## వజ్రాలు!

భూగర్భంలోని బొగ్గే అమితమైన వేడికీ, ఒత్తిడికీ లోనై క్రమేణా స్ఫటికరూపంలో వజ్రాలుగా రూపాంతరం చెందుతాయి. ఒక్కొక్కసారి అగ్నిపర్వతాలు బద్దలైనప్పుడు అవి భూమి మీదికి వచ్చి పడతాయి!

## నత్తగుల్లల పట్టు!

కిరీటం ఆకారం గుల్ల కలిగిన 'లింపెట్స్' అనే ఒకరకం నత్త గుల్లలు, పళ్ళెంవంటి పాదాలతో బండలకు బలంగా అతుక్కుపోతాయి. వాటి పట్టును విడిపించాలంటే, వాటి శరీరం బరువుకు దాదాపు 2000 రెట్లు ఎక్కువ బరువును ఉపయోగించవలసివస్తుందట!



న్యూజిలాండ్‌లోని ఒకరకం మొక్కలు గుబురైన ఊలులాంటి ఆకులతో, దూరం నుంచి చూస్తే, అచ్చం మేసే గొర్రెలలాగే కనిపిస్తాయి. అందువల్ల ఆ మొక్కలకు 'వెజిటబుల్ షీప్' అన్న పేరు వచ్చింది!

## 'గొర్రె' గుబుర్లు!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. S. Ghatege



K. P. A. Swamy

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చేరవు తల్లి ఒడి! రెండవ ఫోటో: లేదా నేడు బడి?

పంపినవారు: టి. వక్కబాయి, గ్రిబిల్స్‌పేట, అర్కోణం—631 001

నార్త్ ఆర్కాడ్ (తమిళనాడు)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.










కొరుక్కు తినండి వైట్
నోరూరించే ప్రత్యేకత.
మృదువైన. విభిన్నమైన
సంచలనాత్మక రుచి... క్యాంప్కో
వైట్ క్రీమీ చాక్లెట్... కొరుక్కు
తినండి వైట్! మీరు అది అంటే
యిష్టపడతారు!

భారతదేశపు అతిపెద్ద.
అత్యాధునిక కర్మాగారం నుండి




క్యాంప్కో లిమిటెడ్
మంగుళూరు




Campco chocolates / Milk / White / Treat / TURBO / Eclairs / Fun Bite / mega bite / Playtime / RUBIES / TOFFEE / Assorted Gift Box / Campco beverages / WINNER / COCOA

R K SWAMY/BBDO CL 9321TL

CHANDAMAMA (Telugu) September 1991 Regd. No. M. 4854




పాలు కొబ్బెరల
అపూర్వ సమ్మేళనం
పిల్లల మనసులుదోచే
వింతైన అనుభవం




nutrine
COOKIES




కోకోనక, 'న్యూట్రిన్ కుకీస్' తో
ఆనంద కోలాహలం !




Visesh/NC/9090/Tel